Regd. H. 37

# ఆంధ్ర ప్రదేశ్



సంపుటి 1 | జూలై, 1957 | సంచిక 9

ఆషాఢము, శాలివాహనశకము - 1879



దక్షిణప్రాంతపు సర్వసైన్యాధికారి లెఫ్టినెంట్ జనరల్ వి. యన్. థాపార్ హైదరాబాదు విచ్చేసిన సందర్భంలో ముఖ్యమంత్రిని దర్శించి మాట్లాడారు.



దక్షిణప్రాంతపు సర్వసైన్యాధికారి లెఫ్టినెంట్ జనరల్ వి. యన్. థాపార్ నగరంలో సైనికాధికారులతో ముచ్చటిస్తున్నారు.



# ఆంధ్రప్రదేశ్


సంపుటి 1

జూలై, 1957

ఆషాఢము, శాలివాహనశకము - 1879

సంచిక 9


## విషయసూచిక


| | | |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ ఆర్థికస్థితి | .... | 1 |
| మంగళగిరి | .... | 6 |
| కాకినాడ పాలీటెక్నిక్ | .... | 13 |
| భారతదేశంలో నూరేండ్ల విశ్వవిద్యాలయవిద్య | .... | 18 |
| ఆంధ్రప్రదేశ్ అడవులు | .... | 21 |
| వార్తా చిత్రాలు | .... | 25 |
| ఆంధ్రప్రదేశ్ రైతులు | .... | 33 |
| అభివృద్ధిబ్లాకులలో జరుగుతున్న కృషి | .... | 45 |
| వార్తలు - విశేషాలు | .... | 48 |
| డైరీ | .... | 49 |


**ముఖచిత్రం:**

విశాఖపట్నంవద్ద డాల్ఫిన్సు నోస్ లైట్‌హౌస్‌కు యూనియన్ ప్రభుత్వ తంతి, తపాలా రవాణాశాఖల మంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి 1957 జూన్ 15 వ తేదీన ప్రారంభోత్సవం జరిపారు. ఈ లైట్‌హౌస్ 70 లక్షల క్యాండిల్ పవర్ కలది. దీని కాంతి 40 మైళ్ల దూరం వరకు ప్రసరిస్తుంది. ప్రపంచములోని శక్తివంతమైన లైట్‌హౌస్‌లలో ఇది ఒకటి. రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో 100 లైట్‌హౌస్‌లను నిర్మింపవలెనని భారత ప్రభుత్వం తలపెట్టింది. ఆ నూరింటిలో ఇదికూడా ఒకటి. చిత్రంలో లైట్‌హౌస్ ముందరిభాగం చూడవచ్చును.


— చందా —

సాలుసరి రు. 1—8—0

లేక

ఒక రూపాయ 50 న.పై.

విడిప్రతి 0—2—0 లేక

12 నయా పైసాలు

ఆంధ్రప్రదేశ్ సమాచార పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

# దేశంతో పాటు మీరు కూడా
# అభ్యుదయం పొందండి!

## మీరు మిగుల్చుకున్న డబ్బును
## భారత ప్రభుత్వ చిన్న మొత్తముల పొదుపు పథకంలో
## పెట్టుబడి పెట్టండి!

*భారతదేశంయొక్క*

సామాజికాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్పనదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి సహాయపడండి!

*మీ డబ్బును ఈ క్రింది గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి!*

| | |
|---|---|
| *12 సంవత్సరముల ట్రెజరీ ప్లాన్ సేవింగ్స్ సర్టిఫికెట్లు* | మెచ్యూరిటీ పొందినమీదట నూటికి ఏడాదికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 5,000 లవి కూడా లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకు కొనవచ్చును. |
| *10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు* | ఏడాదికి నూటికి 4 వంతులు చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఒకొక్కరు రూ. 100 లవి మొదలు రూ. 25,000 లవి కూడాలభిస్తాయి. |
| *పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు* | డిపాజిట్లపై రూ. 10,000 ల వరకు నూటికి 2½ వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. శేషముపై రూ. 15,000 ల వరకు నూటికి 2 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. |

### 15 సంవత్సరముల ఆన్యూటీ సర్టిఫికెట్లు

| | |
|---|---|
| జారీచేయబడు ధరలు: రూ. 3,500, రూ. 7,000, రూ. 14,000రూ. 28,000 వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 28,000ల వరకు కొనవచ్చును. | నూటికి ఏడాదికి 3½ వంతుల చక్రవడ్డీతో నెలసరి వాయిదాలుగా 15 ఏండ్ల లోపున తిరిగి చెల్లించబడుతవి. |

## *ఆదాయపు పన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది!*
## *భారతదేశ ఉజ్జ్వల భవిష్యత్తుకొరకై పెట్టుబడి పెట్టండి!*

ఇతర వివరములకు, ఈ పెట్టుబళ్ళకు సంబంధించిన నియమావళికొరకు:

**నేషనల్ సేవింగ్సు కమీషనర్, సిమ్లా చిరునామాకుగాని లేక**
**రీజనల్ ఆఫీసరు, హైద్రాబాదు (దక్కన్)**

చిరునామాకు గాని వ్రాయవలెను.

# ఆంధ్రప్రదేశ్ ఆర్థికస్థితి

## వాస్తవిక దృక్పథంతో సాధక బాధకాలు ఆలోచించి రాష్ట్రాన్ని ఆర్థికంగా పటిష్ఠం చేయవలెనని ఆర్థికమంత్రి విజ్ఞప్తి



ఆంధ్రప్రదేశ్ ఆర్థికమంత్రి డా. బెజవాడ గోపాలరెడ్డిగారు 1957 జులై 3 వ తేదీన రాష్ట్ర శాసన సభలో యావత్తు 1957-58 ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన బడ్జెటును సమర్పిస్తూ రూ. 53 కోట్ల 14 లక్షల ఆదాయం, రూ. 58 కోట్ల 62 లక్షల ఖర్చు చూపెట్టారు. అంటే మన రాష్ట్ర బడ్జెటులో రూ. 5 కోట్ల 48 లక్షల లోటు వుందన్నమాట. పోయిన మార్చి నెలలో అప్పుడు రాష్ట్ర ఆర్థిక మంత్రిగా వున్న శ్రీ కళా వెంకటరావుగారు ఈ ఆర్థిక సంవత్సరపు తాలూకు మొదటి నాలుగు నెలల తాత్కాలిక బడ్జెటును సమర్పించి వోటు పద్దులో శాసన సభ ఆమోదం పొందారు.

శాసనసభకు బడ్జెటు సమర్పించిన రోజు సాయంత్రమే డా. గోపాలరెడ్డిగారు రేడియోలో ప్రసంగిస్తూ రాష్ట్ర పూర్తిబడ్జెటును సకాలంలో సమర్పించడానికి వ్యవధిలేకపోయిందనీ, అందుకు కారణం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ, ఆ తరువాత త్వరలోనే తెలంగాణా ప్రాంతంలో కేంద్ర రాష్ట్ర శాసనసభలకీ, ఆంధ్రప్రాంతములో కేంద్ర శాసనసభ కీ ఎన్నికలు జరుగవలసి రావడం మొదలైన అవాంతరాలనీ తెలియజేశారు. పైగా అప్పటికి మూడు సంవత్సరాల క్రితం ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రమూ, నవంబరు 1 కి పూర్వం అవిభక్త హైదరాబాదు రాజ్యంలోనూ, ఆనాటి నుంచీ ఆంధ్రప్రదేశ్‌లోనూ చేరిన తెలంగాణా ప్రాంతమూ— ఈ రెండిటి ఆదాయ వ్యయాలను పరిశీలించి ఆంధ్రప్రదేశానికి పూర్తి బడ్జెటును తయారు చేసే అవకాశం లేకపోయిందని కూడా వారు తెలియజేశారు.

ఈ సంవత్సరం తమ బడ్జెట్ ప్రసంగం సాధారణ పద్ధతిలో వుండదనీ, సంప్రదాయానికి భిన్నంగా వుంటుందనీ చెబుతూ డా. గోపాలరెడ్డిగారు రాష్ట్ర ఆర్థికపరిస్థితిని యథాతథంగా చిత్రించి, కొత్త పన్నులు వేటినీ "ఇప్పుడే" తాము ప్రతిపాదించబోవడంలేదని ఓంప్రథమంలోనే ప్రకటించారు. ఈ విషయంలో శాసన సభ్యుల అభిప్రాయాలూ సలహాలూ తెలుసుకొన్నమీదట ఆర్థికపరిస్థితిని బాగుచేయడానికి స్థిరమైన సక్రమ చర్యలు తీసికోవలసి వుంటుందని వారన్నారు.

గత మూడు సంవత్సరాలలో ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల ప్రభుత్వ ఆదాయ వ్యయాలనూ, లోటులనూ, ప్రభుత్వ ఋణాలనూ సమీక్షచేస్తూ మొత్తంమీద ఆంధ్ర ప్రదేశ్ ఆర్థిక పరిస్థితిని వారు దిగువ విధంగా వివరించారు :

(రూ.లు కోట్లలో)

| | 1954-55 | 1957-58 |
|---|---|---|
| 1. రెవిన్యూ ఆదాయం | 36.33 | 53.14 |
| 2. రెవిన్యూ ఖర్చు | 42.02 | 58.62 |
| 3. రెవిన్యూ లోటు | — 5.69 | — 5.48 |
| 4. పెట్టుబడి ఖర్చు | 16.50 | 25.04 |
| 5. ప్రభుత్వ ఋణం (ముగింపు) | 99.98 | 165.48 |
| 6. నగదు విలువ (ముగింపు) | 4.32 | — 13.61 |

గడచిన మూడు సంవత్సరాల కాలంలో ఆంధ్ర ప్రాంతంలో ఆదాయం చెప్పుకోదగినంతగా పెరిగింది. తెలంగాణా ప్రాంతంలోకూడా ఆదాయం కొంతవరకు పెరిగింది. అయితే వ్యయంకూడా త్వరితగతిని హెచ్చుతూ వచ్చింది. పైగా ఆదాయంతో పందెమేసి పరుగెత్తింది. ఈ ఆదాయ వ్యయపోటీ పరుగులో వ్యయమే గెలిచి ముందుకు పరుగెత్తింది. దీనివల్ల ఆదాయ వ్యయాలమధ్య ఆయేటి కాయేడు వ్యత్యాసం పెరిగిపోయి ప్రభుత్వం ప్రజలవద్ద నుంచి పెద్దమొత్తాలు ఋణాలు తీసుకోవలసి వచ్చింది. ఆ ఋణాలు పెరుగుతూ పొయ్యాయి. ఆ ఋణాలకు అయ్యే వడ్డీకే రాష్ట్రప్రభుత్వం ఇప్పటి బడ్జెట్లో రూ. 5 కోట్లు కేటాయించవలసి వచ్చింది. ప్రభుత్వ ఋణం మొత్తం దాదాపు రూ. 165.5 కోట్లుఅయింది. మిగులులో వున్ననగదు పరిస్థితి ఈ రోజున రూ. 13 కోట్ల 61 లక్షలు.

ఇతర రాష్ట్రాలు కూడా లోటు బడ్జెట్లు తయారు చేస్తున్నాయన్న సంగతి మనకు సంతృప్తి కారణం కాజాల దని ఆర్థికమంత్రి అన్నారు. రెవిన్యూ ఖాతాలో ఇప్పుడు మనం అధిక వ్యయం చేసి ఆ ఋణభారం మన తరువాతి తరాల వారికి అప్పజెప్పి ఊరుకోవడం ధర్మం కాదని కూడా వారన్నారు. ఈ తరంవారి సౌకర్యాల కోసం అప్పు చేసి ఆ ఋణభారం మన సంతతి మీద వేయడం న్యాయం కాదన్నారు. ప్రణాళికకయ్యే వ్యయానికి కేంద్రప్రభుత్వం మీద ఆధారపడడం కూడా బాగాలేదన్నారు. ఇండియా ప్రభుత్వంగానీ, రిజర్వు బ్యాంకు గానీ రెవిన్యూ ఖాతాలో లేదా పెట్టుబడి ఖాతాలో మన రాష్ట్రానికి కావలసిన ధన మంతా ఇచ్చే స్థితిలో లేరని తెలియజేశారు. రిజర్వుబ్యాంకు నుంచి మన రాష్ట్రం ఇప్పటికే 12 కోట్ల రూపాయలకు పైగా అప్పు తీసుకుందనీ, నిజానికి ఒప్పందం ప్రకారం రిజర్వు బ్యాంకులో మన రాష్ట్రం తరఫున వడ్డీ లేకుండా 30 లక్షల రూపాయలు హమేషా నిల్వచేసి వుంచాలనీ అన్నారు. ఇండియా ప్రభుత్వంవారు, రిజర్వుబ్యాంకు వారు కూడా పదే పదే ఈ సంగతి మనకు జ్ఞాపకం చేసి ఇవ్వ వలసిన సొమ్మును సర్దుబాటు చేయవలసిందిగా కోరు తున్నారు. ప్రణాళికను అమలు జరపడానికయ్యే ఖర్చులకు గాను రాష్ట్రప్రభుత్వం వీలైనంతవరకు తానే ధనం సేక రించుకోవాలి. ఆ సేకరణ పన్నుల రూపంలో వుండ వచ్చు. ఋణాల రూపంలో ఉండవచ్చు. లేదా చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం ద్వారా కావచ్చు. ఏ రాష్ట్ర ప్రణాళిక ఆ రాష్ట్రానికి సంబంధించినదే. కేంద్రప్రభుత్వం సహాయార్థం గ్రాంట్లుగాని అప్పులుగాని మంజూరు జేస్తుం దని అన్నారు. అనేక పథకాలకు అయ్యే ఖర్చులో మనం సగం భరిస్తే మిగతాసగం భారత ప్రభుత్వం ఇస్తుంది. అయితే మన భాగాన్ని భరించడానికే మనకు తాహతు లేక పోవడం చేత కేంద్ర ప్రభుత్వం యిస్తానన్న సహాయాన్ని మనం వినియోగించుకో లేకపోతున్నామని మంత్రిగారు తెలిపారు.

ప్రభుత్వ ఋణాల విషయమై ప్రస్తావిస్తూ ఇటీవల బొంబాయిలో జరిగిన ఆర్థిక మంత్రుల సమావేశంలో రాష్ట్ర ప్రభుత్వాలు ఋణాలను సేకరించే విషయం చర్చింపబడిం దనీ, అందులో భారత ప్రభుత్వ ప్రతినిధులూ, రిజర్వు బ్యాంకు ప్రతినిధులూ మార్కెట్లో ప్రభుత్వాలకి అప్పులు దొరకడం కష్టమని తెలియ జేశారనీ ఆర్థికమంత్రి చెప్పారు. కేంద్రప్రభుత్వమే నూరుకోట్ల రూపాయలకోసం మార్కెట్లో అప్పుచేయబోతూ వుంది. అందులో 70 కోట్ల రూపాయలు నగదురూపంలో వస్తుందని వారాశిస్తున్నారు. తక్కిన 30 కోట్ల రూపాయలకోసం పాతఋణాలను కొత్త ఋణాలుగా మార్చాలని వారి ఉద్దేశం. కనుక ఈ యేడు మార్కెట్లో ఋణాన్ని తీసుకొనే సంకల్పాన్ని విరమించుకోవలసిందని భారత ప్రభుత్వమూ, రిజర్వుబ్యాంకువారూ రాష్ట్రప్రభుత్వా లకు సలహా చెప్పారు. గ్రామాలలో చిన్నమొత్తాల పొదుపు ఉద్యమంపై దృష్టిని కేంద్రీకరించుకోమని రాష్ట్రాలకు చెప్పారు. అలా చేసినట్లయితే వసూలయిన మొత్తంలో 66⅔ శాతం ప్రణాళిక ఖర్చుకోసమై రాష్ట్రభాగంగా ఇస్తారని వారు తెలిపారు.

రెండవ పంచవర్ష ప్రణాళికకు 1957-58 సంవత్సరంలో రూ. 34.99 కోట్లు ఖర్చుచేయవలెనని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తలపెట్టింది. ఇందులో రెవిన్యూ పద్దుక్రింద రూ. 19.93 కోట్లు, పెట్టుబడి పద్దు క్రింద రూ 25.06 కోట్లు కేటాయించ బడ్డవి. ఈ కార్యక్రమానికి కేంద్రం నుంచి రూ. 24.50 కోట్ల వరకు సహాయం లభిస్తుంది. ఈ సహా యంలో రూ 5.19 కోట్లు గ్రాంటుల రూపంలోనూ, మిగి లింది అప్పుల రూపంలోనూ వుంటుంది. అయినా ఈ సంవత్సరపు ప్రణాళికను విజయవంతంగా అమలు జరుపా లంటే రాష్ట్రప్రభుత్వం ఇంకా రూ. 10.49 కోట్లు సేక రించుకోవాలి. ఇందునిమిత్తమై దాదాపు 5 కోట్ల రూపా యలు ప్రభుత్వ ఋణంగానూ, రూ. 89 లక్షలు చిన్న మొత్తాల పొదుపు క్రిందా వసూలు చేశామనుకున్నాం. ఒక వేళ రాష్ట్రప్రభుత్వం కేంద్రప్రభుత్వమూ, రిజర్వుబ్యాంకూ

ఇచ్చిన సలహాను గనుక పాటించినట్లయితే రూ. 5.89 కోట్ల డబ్బును ఒక్క-చిన్న మొత్తాల పొదుపు ద్వారానే సేకరించుకోవాలి. ఆ మేరకు రాష్ట్ర ప్రభుత్వం తన భాగం పొందాలంటే ఈ రాష్ట్రంలో చిన్న మొత్తాల పొదుపు ఉద్యమంద్వారా మొత్తం ఎనిమిది తొమ్మిది కోట్లు వసూలు కావాలి. ఈ మొత్తం ఈ సంవత్సరం వసూలు కాకపోతే ఎంత వసూలుకాదో ఆ మేరకు రాష్ట్రభాగం తగ్గిపోతుంది. అప్పుడు మళ్ళీ ధనం లభించే మార్గాలను వెదుక్కోవలసిన సమస్య ఎదుర్కొంటుందని మంత్రిగారు వివరించారు.

తరువాత ఆర్థికమంత్రి ఇలా చెప్పారు: "సభాసదులకూ ప్రజానీకానికీ నిజపరిస్థితిని నిష్కర్షగా నివేదించడమే శ్రేయస్కరమని నేను భావించాను. ఒకవైపు జాతీయ ప్రణాళికా నిర్వహణ, మరొవైపు పురోగమిస్తున్న ప్రజల కోర్కెలు - వీటితో ప్రభుత్వ ఖర్చును తగ్గించుకొనే మార్గం గోచరించడంలేదు. తెలంగాణా ఉద్యోగుల జీతాల స్థాయిని ఆ విధంగానే ఉంచుతామని హామీ ఇచ్చాము. ప్రస్తుత ఉద్యోగపు జీతమేకాదు, ఒక ప్రమోషనుకూడా ఆ స్థాయిలోనే వుండాలని నిశ్చయించాము. ఒక లోయర్ డివిజన్ గుమస్తా అప్పర్ డివిజన్ గుమాస్తాగా గాని, ఒక అసిస్టెంట్ సెక్రటరీగా డిప్యూటీసెక్రటరీగాగాని ప్రమోషను పొందినపుడు తెలంగాణా ఉద్యోగులు తమసాటి ఆంధ్రోద్యోగులకంటె ఎక్కువ జీతాలు తీసుకుంటారు. అంతేగాక ఈ రెండు ప్రాంతాలలో చట్టాలు వేర్వేరుగా వున్నవి. పన్నుల విధానాలు వేర్వేరుగా వున్నవి. ఇప్పుడో మరొకప్పుడో వాటిని సమైక్యం చేయవలసిన ఆవశ్యకతవుంది. గౌరవనీయులైన సభ్యులకు తెలిసినవిషయమే. ఈ నవ నిర్మాణంలో ప్రథమ సోపానంగా యావదాంధ్ర ప్రదేశం లోను ఒకేవిధమైన అమ్మకపు పన్ను చట్టం ప్రవేశ పెట్టాము. అది 1957 జూన్ 15 వ తేదీనుంచి అమలులోకి వచ్చింది. 1956-57 సంవత్సరంలో అమ్మకపు పన్నుమీద రెండు ప్రాంతాలలో కలిపి ఆరుకోట్ల రూపాయలు మాత్రమే లభించాయి. ఈ 1957-58 సంవత్సరపు బడ్జెటు అంచెనాలలో 8 కోట్ల 30 లక్షల రూపాయలు ఈ పన్నుద్వారా లభిస్తాయని అనుకుంటున్నాము. ఈ ఆదాయం 9 కోట్ల దాకా పెరగ వచ్చుననికూడా ఆశిస్తున్నాము. అయితే అది ఊహ మాత్రమే. వినోదాల పన్నుచట్టం, మోటారు స్పిరిటు పన్ను చట్టం, మోటారు వాహనాల చట్టం మొదలైనవన్నీకూడా ఒకేవిధంగా ఆంధ్ర ప్రదేశ్‌లోని ఇరవై జిల్లాలకు వర్తింప జేయవలెనని ప్రభుత్వ ఉద్దేశం. కోర్టు ఫీజుచట్టం, రిజిస్ట్రేషన్ చట్టం, భూమి పన్ను విధానం - వీటన్నిటినీ సమైక్యం చేయాలనే ప్రతిపాదనకూడా ప్రభుత్వ పరిశీలనలో వుంది."

ఆర్థికమంత్రి ఇంకా ఇలా అన్నారు: "మన రాష్ట్రాన్ని వెంటాడుతున్న బడ్జెట్‌లోటు, పట్టి పీడించే పక్షవాతంలాగా ప్రభుత్వాన్ని చైతన్యరహితం జేసి ప్రయోజనకరమైన నిర్మాణ కార్యక్రమాలకు ప్రతిబంధకంగా వుంటున్నది. మనం పెట్టగలిగిన దానికి సరికి సరిగా సహాయంచేస్తామనే కేంద్రప్రభుత్వ విధానంవల్లకూడా మనం లాభం పొందలేక పోతున్నాము. రెండవ పంచవర్షప్రణాళిక నిర్వహణావకాశాలుగూడా అంత ఆశాజనకంగా లేవు. మన ఆర్థికస్వరూపంలో బడ్జెట్ లోటుగా ప్రత్యక్షమైన వైకల్యాన్ని కళ్ళారా చూస్తూ దాన్ని సరిదిద్దుకోకుండా మనం ఒక క్షణం వుండ రాదు. ఆర్థికంగా మనం పటిష్ఠం కావడానికి వెంటనే తరణోపాయాలను ఆలోచించాలి."

"ఆంధ్రప్రదేశ్ పురోగమించిన రాష్ట్రంకాదు. ధైర్యంతో ముందడుగువేసి రాష్ట్ర పురోగమనం సాధించడమో, లేదా డబ్బు సేకరించుకోలేక దిగాలుపడి కూరుకుపోవడమో - ఈ రెండు మార్గాలే మనముందున్నవి. మరో మార్గంలేదు. మన ఆలోచనలో, మాటలో, ఆచరణలో సమన్వయం కావాలి. మన ఆలోచనలు ఆకాశవథంలో విహరిస్తాయి. మన మాటలు కోటలు దాటుతాయి. కాని మనచేతలు మాత్రం పాతవే. మనస్సులో శ్రేయఃపథంకోరి, వాక్కులో శ్రేయోరాజ్యాన్ని ప్రశంసించి కర్మలో విశిష్టత లేక కదలికలేని జడపదార్థంవలె నిశ్చేష్టులమై పోతున్నాము. మనం కాయకష్టులా పని చెయ్యాలి. మన జాతీయ పంచవర్షప్రణాళిక జయప్రదంగా సర్వజన మంగళకరంగా కొనసాగించాలి. లేదా ప్రజలలో అసంతృప్తి నిస్పృహ ప్రబలుతవి. మన పన్నుల భారం వృద్ధి జేసుకోవాలి. చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం ద్వారా ధనసేకరణ చేయాలి. మనకు మంచి అవకాశాలు వున్నాయి. ప్రజానీకంలో ఉత్తేజం ఉద్రేకం వున్నాయి. వ్యవసాయం కోసం, నీటి వసతికోసం, విద్యుచ్ఛక్తి కోసం మనం అపారమైన ధనం ఖర్చుచేస్తున్నాము. అందువల్ల ప్రజానీకానికి శ్రేయస్సు కలుగుతున్నది. ఆ శ్రేయస్సులో కించిద్భాగం పన్నురూపేణా ప్రజలు ఇవ్వలేరనే భావానికి సరియైన కారణం లేదు. కొన్ని రాష్ట్రాలు యుద్ధానంతరం నీటి పన్నును రెండు రెట్లు పెంచాయి. మన రాష్ట్రంలో సస్యశ్యామలమైన గోదావరి కృష్ణా డెల్టా భూములకు వేసే

పన్నులు అంత సుక్షేత్రంగానట్టి తెలంగాణా భూముల మీద వేసే పన్నులకంటే కూడా తక్కువగా వున్నవి. క్రొత్త ప్రాజెక్టుల క్రింది భూములకు విధించాలని సంకల్పించిన రేట్లకంటె కూడా తక్కువగా వున్నవి. ఆంధ్ర ప్రదేశ్‌లో లక్షలాది ఎకరాలు వాణిజ్య పంటల క్రింద వున్నవి. ఈ పంటలమీద కొద్దిగా పన్నును పెంచే అవకాశమున్నదేమో పరిశీలించాలి. కొన్ని రాష్ట్రాలు వ్యవసాయంమీద వచ్చే ఆదాయంపై పన్నులు వేస్తున్నవి. మద్రాసు, మైసూరు రాష్ట్రాలలో కాఫీ మొదలైన తోటల మీద వ్యవసాయ ఆదాయపు పన్నులు వేస్తున్నారు. తెలంగాణాలో వ్యవసాయాదాయపు పన్ను అమలులో వుంది; కాని దానివల్ల పోయిన సంవత్సరం లక్షయాభైవేలు మాత్రమే వసూలైనవని చెప్పడానికి విచారంగావుంది. వ్యవసాయాదాయపు పన్నుకుబదులుగా భూమ్యాదాయంపై తరగతుల వారీగా సర్చార్జీ వేస్తే బాగుంటుందేమో మనం ఆలోచించాలి. మన ఖనిజసంపద వల్ల కూడా ప్రభుత్వానికి అధిక ఆధాయం లభించే మార్గాలు అన్వేషించాలి. ఇవన్నీ ఏ విధంగా అమలులోకి తేవాలనేది ఆలోచించవలసిన విషయం. ఆంధ్ర ప్రాంతములో కంటె తెలంగాణా ప్రాంతములో రిజిస్ట్రేషన్ ద్వారా వచ్చే ఆదాయం చాలా తక్కువ. మన రెవిన్యూమంత్రి ఈ విషయాన్ని పరిశీలిస్తున్నారు. ఉదాహరణకి మాత్రం ఈ విషయాలు మనవి చేశాను. మనమంతా కలిసి వీటిని పరిశీలిస్తే మరి కొన్ని కొత్త మార్గాలు స్ఫురించవచ్చు. గౌరవనీయులయిన సభ్యులు దయచేసి ఈ విషయాలను తీవ్రంగా ఆలోచించి బడ్జెటుపై జరిగే చర్చలో నిర్మాణాత్మకమైన సలహా లివ్వవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను."

అదేరోజు సాయంత్రం ఆర్థికమంత్రి డా. గోపాలరెడ్డి గారు ఆలిండియా రేడియో హైద్రాబాదు నిలయంనుంచి ప్రసంగిస్తూ జాతీయ ప్రణాళికను జయప్రదంగా అమలు జరిపితేనే దేశానికి విమోచనం కలుగుతుందని ఉద్ఘాటించారు. "పరాధీనమైన భారత స్వాతంత్ర్య సాధనకోసం మన దేశభక్తులూ, సైనికులూ సరిగా నూరు సంవత్సరాల క్రితం సమరం ప్రారంభించారు. ఆ ఉద్యమం దినదినాభివృద్ధిజెంది సరిగా పది సంవత్సరాలక్రితం 1947 లో గాంధీ మహాత్ముని సత్యాహింసల మార్గంలో విజయం పొందింది. భారత స్వాతంత్ర్య సంగ్రామ శతాబ్ద్యుత్సవాన్నీ స్వాతంత్ర్యం పొందిన దశాబ్ద్యుత్సవాన్నీ వొచ్చే నెలలో మనం పండుగగా చేసుకోబోతున్నాము." అంటూ "అసలు మనం స్వాతంత్ర్యంకోసం ఎందుకు పోరాడాము?" అని డా. రెడ్డిగారు ప్రశ్నించి "మనదేశ సంపదఫలితం మనకు దక్కించుకోవాలనీ, స్వరాజ్యంవొస్తే ప్రజలకు అభ్యుదయం కలుగుతుందనే గదా! అందుకోసమే జాతీయ ప్రణాళికను తయారుచేసి సర్వతోముఖాభివృద్ధికోసం ప్రయత్నిస్తున్నాము. ఈ సాధనలో ప్రజ, ప్రభుత్వము బండికి రెండు చక్రాలు. అవి పరస్పరాధారములు. ఒక చక్రం నడిస్తేనే గాని రెండోచక్రం కదలదు." అని సమాధానం చెబుతూ ఈ శ్రేయోమార్గయాత్రలో ప్రజలు తమ హక్కులనే గాక బాధ్యతలనుకూడా గమనించవలెనని ఆర్థికమంత్రి ఆంధ్ర ప్రదేశ్ ప్రజానీకానికి విజ్ఞప్తి చేశారు.

## బడ్జెటు సంగ్రహ చిత్రణ

### (అంకెలు లక్షల రూపాయలలో)

| | | బడ్జెటు అంచనా 1957-58 | | |
|---|---|---|---|---|
| | | ఆంధ్ర<br>రూ. | తెలంగాణా<br>రూ. | ఆంధ్ర ప్రదేశ్<br>రూ. |
| (అ) రెవిన్యూ ఖాతాలో ఆదాయ వ్యయాలు : | | | | |
| (1) ఆదాయం | .... | 32,21.78 | 20,92.59 | 53,14.37 |
| (2) ఖర్చు | .... | 34,64.48 | 23,97.92 | 58,62.40 |
| (3) లోటు (–) | .... | – 2,42.70 | – 3,05.33 | – 5,48.03 |

| | | బడ్జెటు అంచనా 1957-58 | | |
|---|---|---|---|---|
| | | ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్రప్రదేశ్ |
| | | రూ. | రూ. | రూ. |
| (అ) రెవిన్యూ ఖాతా గాక ఇతర వ్యవహారములు : | | | | |
| (1) వసూళ్ళు : | | | | |
| ఓపెన్ మార్కెట్ ఋణాలు | .... | 3,65.00 | 1,35.00 | 5,00.00 |
| భారతప్రభుత్వం నుంచి ఋణాలు | .... | 16,86.00 | 7,94.00 | 24,80.00 |
| డిపాజిట్ వ్యవహారాలు మొదలైనవి (నికరం) | .... | 59.45 | 2,18.29 | 2,77.74 |
| మొత్తం వసూళ్ళు | .... | 21,10.45 | 11,47.29 | 32,57.74 |
| (2) చెల్లింపులు : | | | | |
| (అ) పెట్టుబడి వ్యయం | .... | 15,63.23 | 9,41.05 | 25,04.28 |
| (ఆ) ప్రభుత్వం ఋణం (తిరిగి చెల్లింపు) భారతప్రభుత్వం నుంచి ఋణాలు మొదలైనవి | .... | 5,12.26 | 1,37.34 | 6,49.60 |
| (ఇ) స్థానిక సంస్థలు మొదలైన వాటికి అప్పులు (నికరం) | .... | 1,24.75 | 41.83 | 1,66.58 |
| మొత్తం చెల్లింపులు | .... | 22,00.24 | 11,20.22 | 33,20.46 |
| (3) వసూళ్ళకంటె చెల్లింపుల ఆధిక్యత | .... | — 89.79 | + 27.07 | — 62.72 |
| (ఇ) నిల్వలు : | | | | |
| (1) ప్రారంభ నిల్వలు | .... | — 9,71.50 | 2,21.13 | — 7,50.37 |
| (2) ముగింపు నిల్వలు | .... | — 13,03.99 | — 57.13 | — 13,61.12 |



## ఆంధ్రప్రదేశ్‌లో దర్శనీయమైన స్థలాలు :

# మంగళగిరి

— శ్రీ పి. ఆర్. రామానుజాచార్యులు

మంగళగిరి క్షేత్రము అనాదికాలమునుండి వైష్ణవాశ్రమము అనే పేరుతో ప్రసిద్ధిజెందియున్నది. పంచ సంస్కారపరులైన వైష్ణవోత్తముల నివాస స్థలము. "అత్రోత్పన్న జనాస్సర్వే వైష్ణవా నిత్య సంశ్రితాః" అని ప్రమాణ వచనం. ఇక్కడ చేసిన తపస్సు శీఘ్రకాలములో సిద్ధిస్తుంది. అందువల్లనే నముచి యనే రాక్షసుడుగూడా యీ క్షేత్రంలో యేకాగ్రచిత్తంతో తపస్సుచేసి వరాలు పొందాడు. నిరహంకారులై, సాత్విక భక్తితో ఋష్యాదు లెందరో యిక్కడ తపస్సుచేశారు. వీరిలో నారదుల వారు గూడా స్వామివారి పర్వత సమీపంలోనే పర్ణశాలను నిర్మించుకొని పూజా సమయములలో 'గీతం శ్రావయామి' అనే కాలమున సంగీత పాఠకులుగా స్వామివారి కింకరత్వమును స్వీకరించారు. అయినప్పటికి యీ ఋషికి వున్న స్వాతిశయం యేమంటే, యెంతటి రసిక మహాజనులనైనా తన వేదాంతోపదేశముచేత సంసార విముఖులనుగా చేసి భజన పరులనుగా చేయగలననే అహంభావము గల వ్యక్తి. ఈ క్షేత్రములోని స్వామిమాత్రం అహంకారమును సహించరు. అహంకారం అనేది



*కొండపైన పానకాల లక్ష్మీనరసింహస్వామి ఆలయం*



*మంగళగిరి ఊరు, గాలిగోపురం దృశ్యం.*

ఒక వ్యాధి. దానికి వైద్యుడు 'వైద్యో నారాయణో హరిః' అన్నట్లు యీ స్వామివారే దీనికి వైద్యం చేస్తారు. సాత్వికులకు అనారోగ్యంకలిగితే తన పానక శేషం తోనే కుదుర్చుతారు. రాజసులకు వస్తే తగు వైన వాతావరణం కల్పించి, వ్యాధి నివారణో పాయం చూస్తారు. తామసులకు గలిగితే రోగాన్ని, రోగినీగూడా హరిస్తారు. తామసాహంకారులైన నముచి మొదలైనవారు సంహరించబడ్డారు. రాజసాహంకారం గలిగిన నారదునికి ఒక పతివ్రత శాపం యిచ్చింది. ఏమనంటే 'యాత్రార్థమై వచ్చి మా దంపతులతో నా భర్తకు విరక్తిమార్గ ముపదేశించి సంసార విముఖుణ్ణి చేసి, మోక్షార్థిని చేశావుసరే... పుత్రార్థిని యయిన నన్ను కష్టాలపాలు చేయడమే కదా? కాబట్టి ఒక స్త్రీని కష్టముల పాలుచేసిన పాపమునకుగా నీవు నీ అంశతో పాలచెట్టువై పుట్టి కష్టాల పాలుగావలసినది' అని శపించింది. నారదుల వారు వెంటనే శాంతచిత్తుడై 'అమ్మా! నీవు నీ భర్తతోగూడి అనేక విధముల సౌఖ్యము లనుభవించుచూ, బహు సంతానవతివికమ్మా ... భగవదాజ్ఞచే కలిగిన నీ శాపమును స్వీకరించి, నా అంశతో పాలచెట్టునై వుండెదను; గాని నాకు స్వామివారి సమీపములో ఇక్కడనే నివాసముండు నట్లు అనుగ్రహింపు'మని వేడుకొన్నాడు. అప్పుడు స్వామివారుగూడా అనుగ్రహించి ఆ పతివ్రతతో భోసాధ్వి మత్సమీపస్థో మదర్చనమో. మునిః కల్పి తాంనుగతిః క్షీరవృక్షరూపీ విరాజితే అని అనుగ్రహించారు. ఆమెగూడా నారదుని దయతలచి 'ప్రతి మాస ఫలాదానా ద్వంధ్యా సంతానదస్సకృత్' నీ యొక్క ఫలములు ఋతుస్నాతలైనవారు ప్రతి మాసము సేవించితే - వంధ్యలుగూడా - గొడ్రాలు గూడా బిడ్డలతల్లి అవుతుంది. ఈ రీతిగా అనేకమంది స్త్రీలకు మహోపకారం చేయడంచేత ఒక స్త్రీకి

చేసిన అపరాధ దోషము నివర్తికాగలదని చెప్పింది. ఈ విధంగా నారదులవారిని నిరహంకారుణ్ణిగా జేసి తనవద్దనే వుంచుకొన్నారు యీ స్వామివారు. ఈ స్వామివారి సమీపంలో తన పర్ణశాల దగ్గరనే తన అంశతో నారదుడు పాలచెట్టుగా యేర్పడినాడు. సంతానహీనులగువారు అశ్వత్థ ప్రదక్షిణములు, నాగప్రతిష్ఠలు మొదలైన వాటిద్వారా గూడా సంతానప్రాప్తి కలుగనివారు యీ క్షేత్రవాసమున సంతానవతులగుట యీ క్షేత్ర మాహాత్మ్యములలో నొకటి. కుటుంబ నియంత్రణమునకు ప్రచారం జరుగుచున్న యీ రోజులలో గూడా, సంతానం కోసం మంగళగిరి కళ్యాణం సేవించడానికి వచ్చే ప్రజాసామాన్యం వుందనే సంగతి చూచినప్పుడు ఆశ్చర్యం కలుగక మానదు.

ఈ క్షేత్రమున సేవింపవలసినది పర్వతము మీద వేంచేసియున్న నరసింహస్వామి. ఈయననే పానకాల నరసింహమూర్తి అంటారు. ఇక్కడికి ప్రతిరోజూ వచ్చు భక్తులు చేయించు పానకములలో యీ స్వామి సగముమాత్రమే ఆరగిస్తారు. తతిమ్మా సగము భక్తులకుగా మిగిల్చెదనని తానే భగవంతుడు పూర్వము చెప్పినట్లు ప్రమాణ మున్నది. అదే విధముగా సగం మిగల్చడంవల్ల నేటికినీ ప్రత్యక్షదైవమని లోక ప్రతీతి.

ఈ పర్వతానికి హస్తిగిరి, తోతాద్రి, స్తోతాద్రి అని పేర్లున్నాయి. కాని కలియుగంలో మంగళాద్రి - మంగళగిరి - అనేపేరుతో వ్యవహరింపబడుతూన్నది.

రామాయణాది యితిహాసములద్వారా తెలియుచున్న విషయములలో పర్వతములు ఱెక్కలతో యెగురుచున్న కాలం వకటి గోచరిస్తూన్నది. అప్పట్లో పారియాత్ర పర్వతం సప్తకుల పర్వతాల్లో ఒకటి. ఆయన తన భార్య సుశీలతో కామరూపుడై సంచరిస్తూండినాడు. ఈయనకు గలిగిన కుమారుడు హ్రస్వశృంగి భగవంతుడు. మిక్కిలి తేజశ్శాలి, సాత్వికుడు, సద్గుణసంపన్నుడు అయినప్పటికీ ఆకారంలో వికృతుడు. తన వికృతాకారం తండ్రి మన



*కొండపైని ఆలయానికి వెళ్ళేదారి*

స్సుకు బాధాకరంగా వుండినది. ఈ సంగతి గ్రహించిన హ్రస్వశృంగి తల్లిదండ్రులను వదలి, దేశాటనం చేస్తూ, కృష్ణానదికి దక్షిణదిక్కునవున్న యీ వైష్ణవాశ్రమానికి చేరాడు.

ఇచ్చట తపస్సు చేయగోరిన హ్రస్వశృంగి ఆశ్రమవాసులవల్ల తప్తచక్రాంకిన పరుడై అష్టాక్షరీమంత్రానుష్ఠానముచే శ్రీమన్నారాయణుని గూర్చి మూడుసంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ సమయంలో కొమారుణ్ణి వెతుక్కుంటూ వస్తూన్న పారియాత్రిని దూరాన చూచాడు. తనను గుర్తుపట్టకుండా వుండేనిమిత్తం, యేనుగు - హస్తి - రూపాన్ని ధరించాడు.

పారియాత్రి ఆశ్రమవాసుల దగ్గరకువచ్చి నా కొమారుడు హ్రస్వశృంగి ఎక్కడ వున్నదీ తెలియజెయ్యమని అనేక విధాల ప్రార్థించాడు. ఆ గజాకృతితో వున్నవాడే నీకొమారుడని వారు చెప్పగా తెలుసుకొని 'నీతల్లి నీకోసం దిగులుపడియున్నది, యింటికి రమ్మ'ని బ్రతిమాలుకొన్నాడు. కాని కేవల భక్తినిష్ఠాగరిష్ఠుడగు హ్రస్వశృంగి యీ వైష్ణవాశ్రమవాసుల సాహచర్యానందము వదలి సంసారకూపంలో అడుగుపెట్టడానికి యిష్టంలేక నేను యింటికి రాజాలను. నేను అక్కడికివచ్చి చేయునదిలేదు. మీరు వెళ్ళి అమ్మను వోదార్చి సుఖముగా వుండవలసినదని ప్రార్థించాడు. కుమారుని భక్త్యావేశమునకు అచ్చెరువొందినవాడై, దీవించి మరలి స్వస్థలం చేరాడు.

అప్పట్లో గజాకృతిని ధరించిన పర్వతరూపుడైన హ్రస్వశృంగి యిప్పటికి గూడా గజాకారముతోనే అగుపడుచుండును.

శ్లో. హ్రస్వశృంగీ మహాశైలః కామరూపీగజాకృతిః
అత్రస్థిత్వోగ్రతపసామామచింతయదాత్మని
ధ్యానాత్తస్యప్రసన్నాత్మా వరదశ్చక్రిమధ్యగః
స్థాస్యామ్యహాంసదాభక్త్యాచింతనీయః పరిచ్ఛదైః

ఈ ప్రమాణ రీతిగా హ్రస్వశృంగి తపస్సుకు మెచ్చిన భగవంతుడు, స్వయంవ్యక్తరూపుడై ఆవిర్భవించి, పూజింపబడుచుండెను. తరువాత కొంతకాలమునకు సుదర్శన నారసింహ రూపము దాల్చినారు. వీరినే పానకాలస్వామి అంటారు.

పూర్వం హిరణ్యకశిపుణ్ణి సంహరించే నిమిత్త నరరూపముగాకుండా, మృగ రూపముగాకుండా, హిరణ్యకశిపుడు కోరుకొన్న వరాల్లో వుండే స్వరూపంగాకుండా క్రొత్తదైన నరమృగాకారంతో ప్రత్యక్షమై, ప్రాణంగల వస్తువుగాకుండా ప్రాణంలేని వస్తువుగాకుండా వుండే గోళ్ళతో అతన్ని సంహరించాడు. అప్పట్లో అలాగుననే యీ సుదర్శన నారసింహ స్వరూపం - అవతారం - నముచిసంహారం కోసం యేర్పడ్డది.

నముచి చేసిన తపస్సుకు సంతోషించి బ్రహ్మ ప్రత్యక్షమైనాడు. వరం కోరుకోమన్నప్పుడు ఆర్ద్రైన శుష్కైనచ యక్షరక్షో విద్యాధరైః పన్నగ దేవ సంఘైః నరైః ఖగః వృశ్చిక కీటదంశైః గజైర్వరాహైస్మహిషైర్మృగేంద్రైఃదివ్యాస్త్రైరమరైర్మరైశ్వర్యావనరైర్వ్యాళ సంచయైః మృతిర్నస్యాన్మహో సంఖ్యే వరందేహి మమాబ్జజ .... అని హిరణ్యకశిపుడు వగైరాలమాదిరి గాకుండా పొరపాటులేకుండా అడిగినట్టు మామూలువన్నీ అడుగుతూ ... తడిగా వున్న వస్తువుచేతగాని, పొడిగా - ఆరిన - వస్తువుచేతగాని అని కలిపి వరం కోరాడు. బ్రహ్మ తప్పనిసరై యిచ్చాడు.

బ్రహ్మవల్ల యిలాటి వరాలు పొందిన నముచి గర్వాతిశయంవల్ల సాధుజనులను బాధపెట్టసాగాడు. దేవతలందరూ గూడా యీతని బాధలకు తట్టుకోలేక పాలసముద్రముకు పోయి, విష్ణుమూర్తిని ప్రార్థించి తమబాధలు చెప్పుకొన్నారు...ఆ రాక్షస సంహారం జరుపుతాను, మీరు నన్నారాధనచేస్తూండండని అభయమిచ్చి వారిని విష్ణుమూర్తి పంపాడు.

తర్వాత భగవంతుని ఆజ్ఞప్రకారం యింద్రుడు యుద్ధంలో రాక్షసులను సంహారించడం నముచి చూచి విష్ణుమూర్తి సహాయం యింద్రునికి వున్నదని గ్రహించి, తన ప్రాణాలు రక్షించుకోడానికి స్థూలరూపమును విడిచిపెట్టినవాడై మాయచేత సూక్ష్మరూపాన్ని పొంది యీ పర్వతగుహలోకి పరుగెత్తాడు. వెంటనే యింద్రుడు ఒకచక్రమును సముద్రపు నురుగుతో ముంచి - యెత్తి - సుదర్శన మంత్రముతో ప్రయోగించాడు. నముచి చేసిన మాయను ఖండించుకొంటూ వాడు ప్రవేశించిన గుహలోకి దూరింది చక్రం. అంతకుముందే ఆ

గుహలో స్వయం వ్యక్తంగావున్న స్వామివారు యీ చక్రముయొక్క - నాభి - అనగా మధ్యభాగంలో - న - నరమృగాకారాముతో చేరి, తన నిశ్వాసాగ్నిచేత ఆ రాక్షసుణ్ణి సంహారం చేశారు.

తడసిన వస్తువుగాకుండా, ఆరిన వస్తువుగా కుండా వుండే సముద్రపు నురుగుద్వారా తీక్షణమైన అగ్నితో సమానంగా వుండేటట్లు తన నిశ్వాస వాయువును వదలి, నముచియొక్క ప్రాణవాయువును హరించాడు. ఆ నముచి పెద్ద పర్వతాకారంగా యీ పర్వత సమీప ప్రదేశమునబడి మడిసినాడు. అప్పుడు రక్తము కాలవగట్టి ప్రవహించి చిన్న సరస్సుగా యేర్పడింది. అది యిప్పటికీ రక్తకుల్యా అనే పేరుతో వ్యవహరింపబడుతూన్నది.

ఈ ప్రకారం చక్రనాభ్యంతరాపూర్ణమై వెలుగొందు నరశింహాకారమును దేవతలు చూడజాలక పరుగెత్తారు. అంతట బ్రహ్మారుద్రాదుల స్తోత్రములచే ప్రసన్నుడైన స్వామివారు అమృతమును దేవతలచే తెప్పించి, పానముచేసి, అది మొదలు అర్చారూపముతో యీ పర్వతమునందే నిలిపారు. నాటినుంచీ కృతయుగంలో అమృతమును, త్రేతా యుగంలో గోఘృతమును, ద్వాపరయుగమున గోక్షీరమును కలియుగమందు పానకమును ఆరగిస్తానని చెప్పినారు. ఎప్పుడైనా సగం తాను పుచ్చుకొని సగం భక్తుల కొరకు మిగల్చడం యీ స్వామివారి ప్రత్యేకత.

కలియుగంలో నేడు భారతదేశంలో నాలుగు మూలలనుంచిగూడా మంగళగిరి పానకాలరాయని సేవించుటకు ప్రజానీకం తండోపతండాలుగా వస్తూంటారు. ప్రతిరోజూ మధ్యాహ్నం 12 గంటల వరకు మాత్రమే యీ స్వామివారి దర్శనము చేసుకొనుటకు వీలుంటుంది. అపైన అలయం తలుపులు వేసుకొని అర్చకులు మొదలైన పరివారం కొండదిగి వస్తారు. మరల మరుసటి రోజు వుదయం షుమారు 8 గంటలకు అలయం తలుపులు తీస్తారు. అంతేగాని రాత్రిపూట పూజలేదు. ఎందువల్లనంటే ప్రత్యేకముగా రాత్రిళ్లు దేవతలువచ్చి స్వామివారిని పూజింతురుగాన యేకకాలార్చనమే మానవులకు యేర్పరచినారు.

యీ క్షేత్రమున ముఖ్యముగా చూడదగినది శిల్పకళానైపుణ్యముగల గాలి గోపురం వకటి. ఇది కొండక్రింది దేవాలయంయొక్క తూర్పు ద్వార గోపురం. ప్రత్యేకమైన కట్టడపు శిల్పము దీనియందు చూడవచ్చు. సాధారణంగా గోపురములు యెత్తును బట్టి పునాదులవద్ద చాలా వెడల్పుగలవిగానుండును. ఈలాటివి దక్షిణదేశమున విశేషముగాగలవు. కాని 150 అడుగుల యెత్తుగల యీ గోపురము క్రిందా పైనా కొద్ది అడుగుల తేడాతో స్తంభాకారముగా నిలబడినట్టు కట్టబడియున్నది. ఇట్టి కట్టడ శిల్పములు ప్రపంచమున వ్రేళ్లమీద లెక్కింపవలసినవే. ఇటలీ దేశములోని పైసా నగరమునగల లీనింగ్ టవర్ అనుదానియొక్క నిర్మాణము దీనిని చూచినప్పుడు జ్ఞాపకానికి వస్తుంది.

ఈ గోపురమును 18 వ శతాబ్దములో రాజా వాశిరెడ్డి వెంకటాద్రినాయనింగారు నిర్మించారు. ఈయన తొమ్మిదివందల తొంభై తొమ్మిది గ్రామములకు నాయకుడై, అమరావతిని ముఖ్యపట్టణముగా జేసుకొని, అదర్శప్రాయమైన ప్రజా పరిపాలన జేసిన మహనీయుడు. ఈయన ప్రతిభా విశేషమును యీ గోపురమే చెప్పుచున్నట్లుండును. ఈ మంగళగిరి దేవాలయ పరిపాలనముగూడా వీరి యేలుబడికి లోబడి యుండినదే...

ఈగోపురముగాక ముక్కోటి ద్వారమను ఉత్తర ద్వారాన్ని లోగడ శ్రీ మాడపాటి వెంకటేశ్వర రావుగారు నిర్మించియుండిరి. ఈ ఉత్తరద్వారంమీద గోపురాన్ని శ్రీమాన్ నంద్యాల నరశింహాచార్యులుగారు నిర్మించారు. ఇదేగాకుండా వీరు దక్షిణపు వైపు ద్వారమును గోపురమునుగూడా నిర్మించారు. వీరు గొప్ప విష్ణుభక్తులు. ఈ దేవాలయ ట్రస్టీ పదవిని గూడా షుమారు 18 సంవత్సరములకాలము నిర్వహించారు. ప్రజలనుండి చందాల మూలమున ధనమును రాబట్టి రెండువైపులా గోపురముల నిర్మాణము పూర్తిచేశారు. పడమరవైపుద్వారగోపురమునకుగూడా చాలా పనిచేశారు. కాని మధ్యలో విఘ్నము కలుగుటచేత యీ నిర్మాణం అసంపూర్తిగా నిలిచిపోయింది. అంతవరకు జరిగియున్న పనినిబట్టి చూచినచో తూర్పువైపు గోపురమంత యెత్తైనదిగా కట్టవలెనని వేసిన పునాదులుగా గోచ

రిస్తుంది. వీరి స్వంత ద్రవ్యముతో బంగారుమలామా చేసిన గరుడవాహనము చేయించి స్వామికి సమర్పించారు.

ఈ మూడువైపులా గోపురద్వారములతో ప్రకాశించుచున్న దేవాలయమున వేంచేశియున్నవారు శ్రీ లక్ష్మీ నరశింహస్వామి వారు. వీరికే త్రికాలార్చనయున్ను, అంగ, రంగ, వైభవోపేతమగు వుత్సవాదులున్ను జరుగునది. అమూల్యములగు వస్తు వాహనాలెన్నో గలవు. అందులో తంజావూరు మహారాజా వారిచే సమర్పింపబడినట్టి క్రిందా, పైనా బంగారుడిప్పలతో పొదగబడిన దక్షిణావర్తశంఖము వకటి.

పసిడి పుట్టము దాల్చు శ్రీధరుడు, లక్ష్మి ప్రక్కనే వున్నప్పుడు బంగారానికి కొదవలేదుగా. వస్త్రం బంగారం, వస్తువుల్లో బంగారం, గరుడవాహనం బంగారం యివన్నీ చూచుకొని బంగారుకొండవంటి వాడు, మా నరశింహమూర్తి అని అనుకొంటూ ఉంటారు.

ఈయనకు ప్రతి సంవత్సరం ఫాల్గుణ శుద్ధ సప్తమి మొదలు పౌర్ణమివరకు నవాహ్నిక దీక్షతో బ్రహ్మోత్సవం చాలా వైభవంగా జరుగుతుంది. పౌర్ణమి రోజు సాయంత్రం జరిగే రథోత్సవం మిక్కిలి కన్నుల పండువుగా వుంటుంది. మన దేశంలో గొప్పవాటిని గురించి అనుకొనేటప్పుడు మంగళగిరి రథం, మంగళగిరి తిరునాళ్ళ, మంగళగిరి చాంతాడు యీమూటిని వుదాహరణగా చెబుతూంటారు,

ఈ బ్రహ్మోత్సవాన్ని యేర్పాటుచేసింది పాండవాగ్రజుడైన ధర్మరాజు. అసలు యీ స్వామిని ప్రతిష్ఠ చేసిందిగూడా ఆయనే - ధర్మరాజే - ఎందుకంటే జలే రక్షతు వారాహః స్థలే రక్షతు వామనః అటవ్యాం నారసింహశ్చ సర్వతః పాతు కేశవః అనే ప్రమాణం వుంది. అరణ్యవాసం చేసేవారు కష్ట నివారణకున్ను, అభీష్ట ప్రాప్తికిన్నీ నరశింహ రూపుడైన భగవంతుని ఆరాధిస్తారు. అదేమాదిరి ధర్మరాజు గూడా వైష్ణవాశ్రమమున చేసిన పూజాదికములు శీఘ్ర ఫలదములని తెలుసుకొని యిచ్చటనే అర్చాస్వరూపుడగు, నరహరిని ప్రతిష్ఠించుటకు నిశ్చయించుకొన్నాడు. భీముణ్ణి పంపి వృషదదేశంనుంచి గండకశిలను తెప్పించాడు. దేవశిల్పులచేత యెడమ తొడమీద లక్ష్మీదేవివున్న నరశింహ అర్చావిగ్రహమును చేయించి, యథాశాస్త్రీయంగా ప్రతిష్ఠించి ఆరాధిస్తూండినాడు. ఆ సమయములో ద్వారకా పట్టణమందు శ్రీకృష్ణమూర్తి కొమారుడైన ప్రద్యుమ్నుడు తండ్రితో "నాన్నా నేను పుట్టిన ఫాల్గుణ శుద్ధ సప్తమి మొదలు తొమ్మిదిరోజులు వైభవంగా ప్రతి సంవత్సరం జన్మదినోత్సవాలు జరిగేయేర్పాటు చేయించ" మని కోరాడు. కోరక కోరక కోరిన కొమారుని కోరిక తీర్చనెంచిన శ్రీకృష్ణమూర్తి సరేనన్నాడు. కాబోయ్యే రాజు ధర్మరాజు కాబట్టి ఆయనకు యీ కార్యభారం వప్పజెప్పాడు. అప్పుడు శ్రీకృష్ణ భగవానుని ఆజ్ఞప్రకారం ధర్మరాజుచేత శాశ్వత పద్ధతిగా యేర్పాటుచేసి ప్రారంభింపబడిన బ్రహ్మోత్సవం నేటికీ గూడా వైభవోపేతంగా జరుగుతూన్నది.

స్వామిదర్శనమునకై యీ క్షేత్రమునకు విచ్చేసిన మహనీయులలో ప్రభుచైతన్య స్వామి ఒకరు. వీరు 1810 లో యిక్కడికివచ్చి స్వామిని సేవించుకొని వారిభక్తిని తమ శిష్యకోటికి వెల్లడించారు. వారు యీ క్షేత్రమునకు వచ్చిన గుర్తుకోసం చైతన్య మఠ, స్థాపకులైన భక్తిసిద్ధాంత సరస్వతీ గోస్వామివారు 31-12-1930 తారీఖున శ్రీ చైతన్య పాదుకలను యీ క్షేత్రములో ప్రతిష్ఠించారు. ఈ మందిరము కొండపైకి పోవు మెట్లకు తూర్పువైపున నున్నది.

శ్రీ వల్లభాచార్యులవారు యీ క్షేత్రమునగల వటతీర్థము వద్ద తపస్సుచేసి ప్రసిద్ధిపొందిరి.

శ్రీ లక్ష్మీ నరసింహమూర్తి యిష్టదైవముగాగల శ్రీ శంకరాచార్యులవారు అనేక పర్యాయములు యిక్కడికివచ్చి స్వామివారిని సేవించుచుండిరి.

తర్వాత యీ క్షేత్రమున చూడవలసినది పెద్ద కోనేరు. దీనినే లక్ష్మీకల్యాణ సరస్సు అంటారు. పూర్వము దేవతలు, రాక్షసులు సముద్రమథనము చేశినప్పుడు అన్నిటితోపాటు ఆవిర్భవించిన లక్ష్మీదేవిని విష్ణుమూర్తికిచ్చి వివాహము చేశారు. ఆ సమయంలో మంగళస్నానమునకై అన్ని నదుల తీర్థములతో యేర్పాటు కాబడినది యీ సరస్సు.

[తరువాయి 17 వ పుటలో]

# కాకినాడ పాలిటెక్నిక్

*ఈ నాడు అభివృద్ధికి సంబంధించిన ప్రతి పనికీ సాంకేతికోద్యోగులు హెచ్చుగా కావాలి. కనుకనే రెండవ పంచవర్ష ప్రణాళికలో సాంకేతిక విద్య నిమిత్తమై రూ. 48 కోట్లు కేటాయించబడినవి.*

రెండవ ప్రపంచయుద్ధం ముగిసినతరువాత దేశంలో పర్యవేక్షక, వృత్తి విద్యావిషయక సాంకేతికోద్యోగుల కొరత ఏర్పడింది. అందుచేత యుద్ధానంతర పథకంగా దేశంలోని వివిధ ప్రాంతాలలో రాష్ట్ర ప్రభుత్వాలు పాలీటెక్నిక్‌లను స్థాపించినవి. ఇంజనీరింగు టెక్నాలజీ శాస్త్రాలలోని కొన్ని శాఖలలో పర్యవేక్షకోద్యోగులకు తగు రీతిగా శిక్షణ ఇవ్వడమే ఈ పాలిటెక్నిక్ సంస్థల లక్ష్యం. ఆ సందర్భంలో పూర్వపు ఆంధ్రరాష్ట్రానికి మూడు పాలిటెక్నికులు కేటాయింపబడ్డవి. ఇవి ఒకటి కాకినాడలో, రెండవది వుయ్యూరులో, మూడవది విశాఖపట్నంలో వున్నవి. మొదట ఈ పాలిటెక్నికులు వాణిజ్య పరిశ్రమల శాఖ డైరెక్టరు అజమాయిషీ క్రిందవుండేవి. కాని ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత ఇవి సాంకేతి విద్యాశాఖ డైరెక్టర్ అధ్వర్యం క్రిందికి మార్చబడ్డవి.

కాకినాడ పాలిటెక్నిక్ స్థాపన విషయం చెప్పాలంటే యం. యస్. యన్. చారిటీస్‌వారు కొంతవిరాళంతో పాటుగా 30 ఎకరాల భూమిని 99 ఏండ్లపాటు



కాకినాడ ఆంధ్ర పాలిటెక్నిక్ భవనం



కాకినాడ ఆంధ్రపాలీటెక్నిక్‌లోని మత్స్య, ఓడల రవాణా విభాగంలోగల తిమింగిలపు అస్థిపంజరం.

ప్రభుత్వానికి లీజుకివ్వడం చేత ఈపని ఎంతో సుకరమైంది. ఆస్థలంలోనే ఇప్పుడు పాలీటెక్నిక్ వుంది. ఈ పాలీటెక్నిక్ భవనాలు, యంత్రసామగ్రి మొత్తం రూ. 16 లక్షల విలువ చేస్తాయి. దీని ప్రారంభోత్సవం 28-2-1955 తేదిన జరిగింది.

ఈ పాలీటెక్నిక్‌లో శిక్షణ రెండు విధాలుగావుంది. ఒకటి ఇంజనీరింగు లేక టెక్నాలజీల శాఖలలో అంటే సివిల్ ఇంజనీరింగు, మెకానికల్ ఇంజనీరింగు, మున్నగువాటిలో డిప్లొమా కోర్సు శిక్షణ. ఇది శిక్షణ పొందే అభ్యర్థులను సూపరైజరీ కేడర్లకు సిద్ధం చేస్తుంది. డిప్లొమా కోర్సులలో ప్రవేశంపొందాలంటే యస్. యస్. యల్. సి. లేక మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులై విశ్వవిద్యాలయ విద్యాభ్యాసానికి అర్హత కలిగి వుండాలి. ఈ కోర్సుల శిక్షణకాలం మూడేండ్లు. అభ్యర్థి దాదాపు పబ్లికుపరీక్షవంటి డిప్లొమా బోర్డు పరీక్షలో ఉత్తీర్ణుడైన తరువాత ప్రభుత్వంచే పరిగణింపబడిన ఒక వర్కు-షాపులోగాని లేదా ఫ్యాక్టరీలోగాని ఒక సంవత్సరంపాటు ప్రత్యక్ష శిక్షణ పొందాలి. ఈ పాలీటెక్నిక్‌లో డిప్లొమా తరగతిలో ఆరు కోర్సులున్నవి. 1. సివిల్ ఇంజనీరింగ్. 2. మెకానికల్ ఇంజనీరింగ్ 3. ఫిషరీస్ టెక్నాలజీ అండ్ నేవిగేషన్ 4. ఆటోమొబైల్ ఇంజనీరింగ్ 5. రేడియో ఇంజనీరింగ్ 6. ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్.

డిప్లొమా కోర్సులుగాక సర్టిఫికెట్ తరగతికి చెందిన వివిధకోర్సులుకూడా వున్నవి-పాలీటెక్నిక్‌లో ఒక విభాగంగా వున్నట్టి ఇండస్ట్రియల్ స్కూలులోని ఆర్టిజాన్ కోర్సులు సర్టిఫికెట్ తరగతికి చెందినవే. ఇప్పుడిందులో ఏడు రకాల కోర్సు లున్నవి. 1. జనరల్ మెకానిక్కు, 2. ఎలక్ట్రిక్ వైరింగు. 3. చేనేత 4. వడ్రంగం, 5. పేటర్న్ మేకింగ్, 6. ఆటోమెకానిక్కు, 7. పిషరీస్ కోర్సు. ఈ ఏడు కోర్సులలో ప్రవేశం పొందాలంటే థర్డుఫారం ప్యాసైవుంటేచాలు. ఈ కోర్సుల శిక్షణకాలం ఒక సంవత్సరం మొదలు మూడు సంవత్సరాల వరకూ వుంటుంది.

ఈ పాలీటెక్నిక్ విషయంలో చెప్పవలసిన మరొక విశేషమేమిటంటే యువకులయిన అభ్యర్థులు ఇందులో



ఆంధ్ర పాలిటెక్నిక్‌లో నేత శిక్షణ తరగతి



ఆంధ్ర పాలిటెక్నిక్‌లోని మెషిన్‌షాపు



ఆంధ్ర పాలిటెక్నిక్‌లోని మెకానికల్ ఇంజనీరింగు తరగతి వర్కుషాపు విభాగం



కాకినాడ ఆంధ్ర పాలిటెక్నిక్‌లోని ఎలక్ట్రికల్ ఇంజనీరింగు లేబొరేటరి



ఆంధ్రపాలీటెక్నిక్ - విద్యార్థుల వసతిగృహం.

శిక్షణ పొందనక్కరలేకుండానే ప్రయివేటుగా డిప్లొమా బోర్డు పరీక్షలకు కూర్చొని డిప్లొమా లేక సర్టిఫికెట్ పొందవచ్చు. స్కూలులో అకడమిక్ కోర్సు చదవలేని స్థితిలో వున్న యువకులు ఏదేని సాంకేతిక వృత్తిలో 10 ఏండ్ల ప్రత్యక్షానుభవం కలిగి వున్నట్లయితే వారుకూడా డిప్లొమా సంపాదించుకోడానికి వీలుంది.

మరొక విశేషమేమిటంటే ఈ పాలీటెక్నిక్‌లో శిక్షణపొందే అభ్యర్థులకు విస్తృతంగా ప్రత్యక్ష శిక్షణ ఇచ్చే లక్ష్యంతో ప్రభుత్వ శాఖలకూ ప్రయివేటు సంస్థలకూ సంబంధించిన జాబ్‌వర్కులను ఈ సంస్థ స్వీకరిస్తున్నది.

* * * *

---

మంగళగిరి

[12 వ పేజీ తరువాయి]

అందువల్ల దీనికీపేరు. ప్రతిసంవత్సరం కల్యాణోత్సవము ఆఖరున వసంతములు అయినతర్వాత స్వామివారు యీ సరస్సుకు స్నానముకై వేంచేయుదురు. ఈ క్షేత్రమునకు వచ్చి వారు ముఖ్యముగా ఆచరించ వలసిన కార్యక్రమములో,

శ్లో. లక్ష్మీకల్యాణ సరసిస్నానంచాద్రిప్రదక్షిణం నృసింహా పానకం శేషం త్రయం కైవల్యదాయకం. అని ప్రమాణం

యీ కోనేటిలో స్నానంచెయ్యడం గొప్పప్రదక్షిణం, పానకశేషము పుచ్చుకొనడం యీ మూటితోనే పంచ సంస్కారపరులకు మోక్షసామ్రాజ్యము లభించునని ఘంటాపథంగా క్షేత్రమాహాత్మ్యంలో శంకరునిచేత పార్వతీదేవికి వుపదేశించ బడినది.

మంగళకరు డగు శంకరునిచే సర్వమంగళకు చెప్పబడిన మంగళగిరి మాహాత్మ్యము మాకు సర్వ మంగళముల నొసంగగలదు అననదే మంగళాచరణ పాఠమై చెలంగగలదు.

(అలిండియారేడియో సౌజన్యముతో)

# భారతదేశంలో నూరేండ్ల విశ్వవిద్యాలయవిద్య

ప్రొఫెసర్ యం. యస్. దొరైస్వామి
(ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుడు)

పాశ్చాత్య దేశాలలో ఉన్నత విద్య ఎనిమిది లేక తొమ్మిదో శతాబ్దం నుంచి మాత్రమే ఆరంభమైంది. అక్కడిప్రాచీన విశ్వవిద్యాలయాలు ఏవీ అంటే లెక్కకువచ్చేది ప్యారిస్, ఆక్సుఫర్డ్, కేంబ్రిడ్జీలే. కాని ప్రాచీన దేశాల వ్యవహారంవేరు, ముఖ్యంగా భారత చైనాదేశాలలో క్రీస్తు శకానికి కొన్ని శతాబ్దాల పూర్వమే విశ్వవిద్యాలయవిద్య ఆరంభమైంది. ఉత్తరాన వారణాసి, దక్షిణాన కంచి గొప్ప విద్యా పీఠాలుగా అలరారుతూ వుండేవి. నలందా,తక్షశిల విశ్వ విద్యాలయాలు జగత్ప్రసిద్ధమైనవి. నలందా విశ్వ విఖ్యాతమైన బౌద్ధ విశ్వవిద్యాలయం. తక్షశిల విశ్వ విద్యాలయం క్రీ. శ. 5వ శతాబ్దంవరకు గొప్ప విద్యా సాంస్కృతిక కేంద్రంగా వుండేది. నలందా విశ్వవిద్యా లయం క్రీ. శ. 12వ శతాబ్ది ఆఖరులో ధ్వంసంచేయ బడింది. ఆతరువాత కొన్ని శతాబ్దాలవరకు దేశంలో అక్కడక్కడా కళలు, శాస్త్రాలు బోధింప బడుతూనే వచ్చాయి. అయితే విశ్వవిద్యాలయాలనిచెప్పి ఈనాడు వ్యవహరింపబడుతున్నట్టి విద్యా సంస్థలు ఒక శతాబ్దం పూర్వం మాత్రమే భారతదేశంలో నెలకొల్పబడ్డవి. 1857 లో మొట్టమొదట కలకత్తా విశ్వవిద్యాలయం స్థాపించబడింది. ఆ తరువాత బొంబాయి, మద్రాసు విశ్వవిద్యాలయాలు నెలకొన్నవి. ఈ విశ్వవిద్యా లయాలు ఇటీవలనే శతాబ్ద్యుత్సవాలు కూడా జరుపు కున్నవి. ఇవి లండన్ విశ్వవిద్యాలయం మాదిరిగా వివిధ కళాశాలలను అనుబంధ సంస్థలుగా చేర్చుకొని పరీక్షలు నడిపేవి మాత్రమే. ఆ పిమ్మట పాతిక శతాబ్దం గడిచే వరకు కూడా ఉన్నత విద్య విషయమై ఎట్టి అభివృద్ధీ జరుగలేదు. 1882 లో మాత్రం పంజాబు విశ్వవిద్యాలయం నెలకొల్పబడింది. తరు వాత అయిదేండ్లకు అలహాబాదు విశ్వవిద్యాలయం ఏర్పడింది. ఇది నివాస వసతి, విద్యాబోధన-ఈరెండు ఏర్పాట్లూ వున్న విశ్వవిద్యాలయం. ఆ తరువాత ఈ ఇరవైయేళ్ళలోనూ ఇతర విశ్వవిద్యాలయాలు ఏర్ప డ్డాయి.

1902 లో విశ్వవిద్యాలయాల కమీషన్ ఏర్పాటు చేయబడింది. విశ్వవిద్యాలయాల స్థితులను విచారణ చేసి విశ్వవిద్యాలయ బోధన ప్రమాణాలను హెచ్చించ డానికీ, విద్యాభివృద్ధికీ తీసుకోవలసిన చర్యలను సిఫా రసు చేయడమే ఈకమీషన్‌పని. తరువాత 1916 లో కలకత్తా విశ్వవిద్యాలయ కమీషన్ నియమింపబడింది. ఈ కమీషన్ విశ్వవిద్యాలయ విద్యాసమస్యకు సంబం ధించిన అన్ని అంశలానూ సాకల్యంగా పరిశీలించి, సెకండరీ, యూనివర్సిటీ దశలకు సంబంధించిన విద్య విషయంలో 1919 లో ఒక పెద్ద నివేదిక సమర్పిం చింది. భారతదేశంలో ఉన్నత విద్యా చరిత్ర విష యంలో ఈ నివేదిక అతిముఖ్యమైనదిగా ఈనాటికీ పరిగణింపబడుతున్నది.

1919 లో ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపించ బడింది. ఈ విశ్వవిద్యాలయానికి ఆదిలోనే ఒక ప్రత్యేకత వుంది. ఏమిటంటే భారతదేశ భాషలలో ఒకటీ, అప్పుడు అధికార భాషా అయినట్టి ఉర్దూ ఈ విశ్వవిద్యాలయములో బోధనాభాషగా స్వీకరించ బడింది. ఆ తరువాత అలీఘర్ ముస్లిం విశ్వవిద్యా లయం బెనారస్ హిందూ విశ్వవిద్యాలయం ఏర్పడ్డవి. క్రమంగా 1926 లో ఆంధ్ర విశ్వవిద్యాలయం, 1929 లో చిదంబరంలో అన్నామలై విశ్వవిద్యాలయం స్థాపించబడ్డవి. ఇటీవల మరికొన్ని విశ్వవిద్యాల యాలు ఏర్పడ్డవి. రూర్కీ విశ్వవిద్యాలయానికి ఒక ప్రత్యేకత వుంది. ఏమిటంటే అందులో కేవలం ఇంజ నీరింగు మాత్రమే బోధింపబడుతుంది. రవీంద్రనాథ

టాగూరుచే నెలకొల్పబడిన శాంతినికేతన్ ఇటీవల కేంద్ర విశ్వవిద్యాలయాల జాబితాలో చేర్చబడింది. ఈ విధంగా ఇప్పుడు భారతదేశంలో 32 విశ్వ విద్యాలయాలున్నవి.

### యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్

భారతదేశంలోని విశ్వవిద్యాలయాల సమస్యలను పరిశీలించడానికీ, విశ్వవిద్యాలయాల కృషిని సమన్వయ పరిచేందుకు అంతర్విశ్వ విద్యాలయ సంస్థగానూ, సమాచార సేకరణ సంస్థగానూ, ఉపకరించడానికై 1924 లో ఇంటర్ యూనివర్సిటీ బోర్డు ఆఫ్ ఇండియా నెలకొల్పబడింది. 1948 లో భారత ప్రభుత్వం డా. యస్. రాధాకృష్ణన్ అధ్యక్షతన ఇండియన్ యూనివర్సిటీ ఎజుకేషన్ కమీషన్ (భారత విశ్వవిద్యాలయ విద్యా పరిశీలక సంఘం) నియమించింది. ఈ కమీషన్ మరుసటి సంవత్సరం సమర్పించిన నివేదికలో విశ్వవిద్యాలయాల సమస్యలు సమగ్రంగా విశదీకరింపబడడమేగాక బోధన, పరిశోధనా ప్రమాణాలను హెచ్చించడానికై ముఖ్యమయిన అనేక సిఫారసులుకూడా చేయబడినవి. ఈ కమీషన్‌వారి సిఫారసు ప్రకారమే ఇటీవల యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ నెలకొల్పబడింది. ఇది బ్రిటిషు విశ్వవిద్యాలయాల గ్రాంట్సు కమీషన్ పద్ధతిలో పార్లమెంటు ఆమోదించిన చట్టము ననుసరించి ఏర్పాటు చేయబడింది.

భారతదేశ విశ్వవిద్యాలయాలన్నీ ఒకే పద్ధతిలో లేవు. కొన్ని విద్యాబోధనా, నివాస వసతీగల విశ్వవిద్యాలయాలు. మరికొన్ని అనుబంధ వ్యవహారం కలవి. అయితే ఇట్టి వాటిలో వాటి ఆవరణలలోనే ఉన్నత విద్యకూ పరిశోధనకూ సంబంధించిన శాఖ లున్నవి. ఇప్పుడు ఒక్క విశ్వవిద్యాలయం మాత్రమే పరీక్షా సంస్థగా వ్యవహరిస్తున్నది. పద్ధతిలో కొంత భేద మున్నప్పటికీ నిర్మాణం, వ్యవస్థల విషయకంగా భారత దేశ విశ్వవిద్యాలయాలలో ఒక విధమయిన సార్వజనీనత కన్పిస్తుంది. ప్రతి విశ్వవిద్యాలయానికీ సెనేటు లేక కోర్టు, అకడమిక్ కౌన్సిల్, సిండికేటు లేక ఎగ్జిక్యూటివు లేదా యూనివర్సిటీ కౌన్సిల్ అధికార సంస్థలుగా వున్నవి. దాదాపు అన్ని విశ్వవిద్యాలయాలకూ ఆయా రాష్ట్రాల గవర్నర్లే ఛాన్సలర్లుగా వున్నారు. అయితే ఉస్మానియా విశ్వవిద్యాలయం మాత్రం మ. ఘ. వ. నిజాంగారు జారీచేసిన చార్టర్ ననుసరించి ఏర్పాటయింది కాబట్టి దీనికి రాష్ట్ర ముఖ్య మంత్రే ఛాన్సలర్‌గా వున్నారు. పోతే అనేక విశ్వవిద్యాలయాలలో వైస్ ఛాన్సలర్ (ఉపాధ్యక్షులు) వేతనం తీసుకొని పూర్తికాలం పనిచేసే అధికారిగా వుంటున్నారు. సాధారణంగా వైస్ ఛాన్సలర్‌గా ప్రముఖ విద్యావేత్తగాని, లేదా రాజకీయాలలో ప్రజాహితజీవనంలో సుప్రసిద్ధులయిన వారుగాని నియమింపబడుతూ వుంటారు. గౌరవ వైస్ ఛాన్సలర్లున్న విశ్వవిద్యాలయాలకు వేతనం తీసికొని పూర్తికాలం పనిచేసే ప్రో వైస్ ఛాన్సలర్‌గాని లేదా డైరెక్టరుగాని వున్నారు. వారే విశ్వవిద్యాలయ దైనందిన వ్యవహారాలను నిర్వహిస్తూవుంటారు.

కొన్ని విశ్వవిద్యాలయాలలో సెనేటు, వాటి విధానాన్ని రూపొందించి ఆదాయ వ్యయాలను ఆమోదిస్తుంది. దైనందిన వ్యవహారాలను కార్యనిర్వాహక విధులను సిండికేటు లేదా ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ నిర్వహిస్తాయి. అకడమిక్ కౌన్సిల్, ఫాకల్టీస్, బోర్డు ఆఫ్ స్టడీస్ మొదలగు అధికారవర్గాలు పాఠ్య ప్రణాళికలనూ డిగ్రీలకు డిప్లమాలకు కావలసినఅర్హతలనూ నిర్ణయించే వ్యవస్థలుగా మాత్రమే పనిచేస్తూ వుంటాయి.

### ఆర్థిక సమస్యలు

భారతదేశంలో ఈనాడు అనేక విశ్వవిద్యాలయాలు క్లిష్టమైన ఆర్థిక పరిస్థితుల నెదుర్కొంటున్నవి. రాష్ట్ర ప్రభుత్వాలు, యూనియన్ ప్రభుత్వమూ గ్రాంట్లు ఇస్తున్నప్పటికి కూడా చాలా వాటికి ఇంకా లోటుబడ్జెట్లే! యూనివర్సిటీ గ్రాంట్సు కమీషన్ ఏర్పడ్డ తరువాత అన్ని విశ్వవిద్యాలయాలలో పట్టభద్రానంతర బోధనకూ పరిశోధనకూ, ఇతర విస్తృతీకరణ పథకాలకూ అయ్యే ఖర్చు నిమిత్తమై భారత ప్రభుత్వం కమీషన్ ద్వారా ఉదారంగా ఆర్థిక సహాయం చేస్తూవున్నది. భవనాలకూ, యువజన సంక్షేమ కార్యక్రమాలకుకూడా ఉదారంగా విరాళా లిస్తున్నారు. కేంద్రం ఈ విధంగా ఎంతో సహాయం చేయడంవల్లనే మన దేశంలోని వి[illegible] విద్యాలయాలు పదేండ్లక్రిందటికంటె అంటే స్వాతంత్ర్యం లభించినప్పటికంటే ఈనా[illegible] పరిశోధనకూ చాలావరకు తగివున[illegible]

దిన ప్రజాస్వామ్య వ్యవస్థవల్ల కలిగే బాధ్యతలూ, సమస్యలూ గుర్తింపబడుతున్నవి. ఆ సమస్యల పరిష్కారం విషయంలో విశ్వవిద్యాలయాలుకూడా యథాశక్తి కృషిచేస్తున్నవి. జాతీయ పునర్నిర్మాణంలో తమ బాధ్యత లేమిటో విశ్వవిద్యాలయాలకు తెలుసు. ఈసందర్భంలో కార్డినల్ న్యూమన్ విశ్వవిద్యాలయాల లక్ష్యాన్నిగూర్చి అన్నమాటలు నాకు జ్ఞప్తికొస్తున్నవి. "సమాజంయొక్క వివేచనాశక్తిని వికసింపజేయడం, ప్రజల మనోభావాలను క్రమరీతిలో రూపొందించడం, జాతీయ అభిరుచులను పునీతం చేయడం, ప్రజా చైతన్యానికి నీతిబద్ధమైన సూత్రాలను ఏర్పర్చడం, ప్రజల వాంఛితాలకు నిర్ణీతలక్ష్యాలను సూచించడం, వర్తమాన యుగ భావాలను ఉద్రేక రహితం చేసి సహేతుకం చేయడం, రాజకీయాధికారాన్ని చెలాయించడానికి తగు వాతావరణాన్ని కల్పించడం, వ్యక్తిగత జీవితాన్ని నిర్మాలిన్యం చేయడం—ఇవే విశ్వవిద్యాలయ ఆదర్శాలు" అని ఆ మహానుభావు డన్నాడు.

ఈ లక్ష్యాలను, ఆదర్శాలను మన విశ్వవిద్యాలయాలకు వర్తింపజేసి పరిశీలిస్తే అవి అతిగానేకన్పిస్తాయి. నేనుకూడా ఒక విశ్వవిద్యాలయ సభ్యుణ్ణే. కాబట్టి అంత పెద్ద లక్ష్యాలుపెట్టి వుమ్మల్ని పరీక్షించడం అతిగానే వుందని నిరసన తెలుపవచ్చునని నన్ను ఎవరయినా అనుమానించవచ్చు.

## విమర్శలు

భారతదేశ విశ్వవిద్యాలయాలపై అనేక విమర్శలు వస్తున్నవి. మన పరీక్షా విధానం వాస్తవమైన విద్యావ్యాప్తికి ప్రతిబంధకంగా వున్నమాట నిజమే. పరీక్షలే సర్వం అని మనం అనుకుంటున్నట్లుగా ప్రపంచంలో మరెక్కడాలేదు. ఉద్యోగాలకోసం యూనివర్సిటీ డిగ్రీలను పట్టాలను మన యువకులు అభిలషిస్తున్నమాటా నిజమే. ఒక పర్యాయం విశ్వవిద్యాలయాన్ని విడిచి పెట్టి వెళ్ళినవారు మళ్ళీవాటి మొఖం చూడని సంగతీ నిజమే. పాశ్చాత్యదేశాలలోవలె మన దేశంలో విశ్వవిద్యాలయ విద్య బాగా వ్యాప్తం కాలేదు. అయినప్పటికీ మనం విరివిగా పట్టభద్రుల్ని తయారు చేస్తూనే వున్నాము. వారిలో చాలామంది తగు ఉద్యోగాలు దొరక్క నానాఅవస్థలూ పడుతున్నారు.

మన విశ్వ విద్యాలయాలు యువ జనంలో విజ్ఞానాన్ని కలిగించాయి. కాని స్వతంత్రంగా ఆలోచించే వైఖరినిపెంపొందించలేదు.మన విశ్వవిద్యాలయాలలో జరుపబడే పరిశోధన ఇంకా తక్కువస్థాయిలోనేవుంది. విజ్ఞానాన్ని పొందడానికి మనం చేసినకృషిలో మనం వివేకాన్ని కోల్పోయామనిచేయబడే విమర్శలోకొంత నిజ ముంది. మన విశ్వ విద్యాలయాలు పాశ్చాత్య విశ్వవిద్యాలయాల ఒరవడిలో ఏర్పడ్డవి గనుక మన చరిత్రకూ, సంప్రదాయాలకూ, సంస్కృతికీ ఇవి అర్హమైన స్థానాన్ని ఇవ్వనిమాటా నిజమే. కనుకనే రాధాకృష్ణన్ కమీషన్ ఆంగ్ల కవి రచించిన ఈ క్రింది పంక్తులను తన నివేదికలో ఉదహరించింది :-

"విజ్ఞానాన్ని సముపార్జించడంకోసం
వివేకాన్ని ఎక్కడో కోల్పోయాం,
సర్వమూ తెలిసివుండాలనే ఆశతో
అమాంబాపతు సంగతులు తెలిసికొని
అసలు విజ్ఞానాన్నే విస్మరించాం,
కాలచక్రంలో ఇరవై శతాబ్దాలు దొర్లిపోతున్నా
మాధవునికి దూరమైపోయి,
మట్టికే సన్నిహితులమయ్యాం"

విద్యావంతులలో వుండవలసిన సత్ప్రవర్తన, సచ్ఛీలం మొదలైన గుణాలు మన దేశంలో విశ్వవిద్యాలయ విద్యపొందిన వారిలో కొరవడుతున్నవి. ఆ గుణాలను మన విశ్వవిద్యాలయాలు వారిలో పెంపొందించలేక పోయినవి. విశ్వ విద్యాలయాలలో విద్యముగించుకొని జీవితరంగంలో అడుగుపెట్టినవారు చాలామంది సత్యం, శౌచం మున్నగు సద్గుణాలతో ఆదర్శప్రాయంగా జీవించజాలలేకపోతున్నారేమో అనిపిస్తుంది.

మన విశ్వవిద్యాలయాలు యువజనులను బాధ్యతాయుతమైన పదవులకు, సమాజ నాయకత్వానికి తగిన విధంగా రూపొందించలేక పోతున్నవి. ఈ విద్యా కర్మాగారాలు మనయువతీయువకులకు చెదురువాటుగా కొంత విజ్ఞానాన్ని కలిగించి విశాల ప్రపంచంలోకి వదలిపెడుతున్నవే గాని వారిలో సుసంఘటితమైన విజ్ఞానాన్ని పెంపొందించి వివేకవంతులను చేయలేక పోతున్నవి.

[తరువాయి 44 పేజీలో]

# ఆంధ్రప్రదేశ్ అడవులు

శ్రీ దౌలత్‌రాయ్ బి. యస్. సి. (వేల్సు)
ఆంధ్రప్రదేశ్ అడవుల ప్రధాన సంరక్షకాధికారి.

**భారతదేశ అడవులు ఎంతప్రాచీనమైనవో అంతప్రసిద్ధమైనవి కూడా. పూర్వం మునుల ఆశ్రమాలు ఈ అడవులలోనే వుండేవి. పురాణాలలోనూ, చరిత్రలలోనూ పలుచోట్ల ఈ అడవుల ప్రస్తావనవుంది. సంపదను ఉత్పత్తిచేస్తూ, భూమి చెడకుండా కాపాడుతూ ఇవి జాతీయ నిర్మాణకార్యక్రమంలో ఎంతగానో తోడ్పడుతున్నవి. ఇటువంటి అడవులను ఇంకా బాగావృద్ధి చేయడానికై మన ప్రభుత్వం జాతీయ అటవీ సంరక్షక విధానాన్ని అనుసరిస్తూ వుంది. మన దేశ అభివృద్ధి ప్రణాళికలో అడవుల సంరక్షణకు హెచ్చు ప్రాధాన్య మివ్వబడింది. భారతదేశ వృక్షసంపదను వృద్ధిపరచడానికై మనం ప్రతిసంవత్సరం వర్షఋతువు ఆరంభం కాగానే జూలై నెల మొదటివారంలో వనమహోత్సవం జరుపుకుంటున్నాము.**

**ఈ వ్యాసంలో శ్రీ దౌలత్‌రాయ్ ఆంధ్రప్రదేశ్ అటవీ సంపదను, దాన్ని పెంపొందించ డానికి అవలంబించబడుతున్న చర్యలను వివరించారు.**

ప్రాచీన కాలంలో గోదావరి నదికి ఇరు ప్రక్కలా వుండేదని చెప్పబడే దండకారణ్యంలో హెచ్చు భాగం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే వుంది. శ్రీరాముడు సీతాదేవి సమేతంగా వనవాసం చేస్తూ దక్షిణానికి వెళ్ళినప్పుడూ, ఆ తరువాత తిరిగి ఉత్తరదేశానికి వెళ్ళినప్పుడూ ఈ రాష్ట్రంలో అనేకచోట్ల విడిదిచేశాడట. ఆ స్థలాలన్నీ ఇప్పుడు పుణ్యక్షేత్రాలుగా ప్రసిద్ధి చెందాయి. వాటిలో అన్నిటికంటే భద్రాచలం బాగా పేరుపొందింది. కనుక ఈరాష్ట్రం అడవులు పౌరాణికంగానూ, చారిత్రకంగానూ పేరు ప్రఖ్యాతులు గలవి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మొత్తం విస్తీర్ణం 1,04881.7 చదరపు మైళ్ళు. ఇందులో 24,878.17 చదరపుమైళ్ళ ప్రాంతంలో అడవులున్నవి. (తెలంగాణాలో అటవీ ప్రాంతం 10,278.17 చదరపు మైళ్ళు, ఆంధ్ర ప్రాంతంలో 14,600 చదరపు మైళ్ళు) అంటే మొత్తం భూమిలో 23.5 శతి అటవీప్రాంత మన్నమాట.

శీతోష్ణస్థితి, భూములు, వర్షపాతం ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క విధంగావున్నవి. కాబట్టి వివిధ రకాల అడవులను వర్గీకరించడం కష్టం. అయితే స్థూలంగా ఈ రాష్ట్రఅడవులను ఈ దిగువ విధంగా విభజన చేయవచ్చు.

1. ఆకురాలు చెట్ల అడవులు
2. ఉష్ణప్రాంతపు ముండ్ల అడవులు
3. ఎప్పుడూ ఆకు అలములతో పచ్చగా వుండే అడవులు
4. సముద్ర తీరపు అడవులు.

## ఆకురాలు చెట్ల అడవులు

ఈ రకం అడవులలో చాలా ముఖ్యమైనవి గోదావరి లోయలోను, తెలంగాణాలోని కృష్ణా లోయలోను వున్నవి. ఇక్కడ టేకు అనేక శాతాలలో లభిస్తుంది. దాదాపు 30 శతికిమించి వుంటుందని అంచెనా. టేకుచెట్లు 60 అడుగులు మొదలు 70 అడుగుల ఎత్తు వరకు వుంటాయి. ప్రానుచుట్టు

కొలత (అంటే భూమట్టంనుంచి 4½ అడుగుల ఎత్తుపైన ప్రమాణను కొలిస్తే) 40 అంగుళాలు మొదలు 60 అంగుళాలుంటుంది. ఇటువంటి చెట్లు వరంగలు, ఆదిలాబాదు, కరీంనగర్, ఖమ్మంజిల్లాలలో కన్పిస్తాయి. గుంజలలాగా వుండి చిన్నరకం కలపగా ఉపయోగపడే టేకుచెట్లు మహబూబ్‌నగర్, మెదక్, నిజామాబాదు జిల్లాలలో వున్నవి.

తెలంగాణాలోని కృష్ణాలోయ అడవు లున్నట్టి మహబూబ్‌నగర్, ఖమ్మంమెట్టు జిల్లాలలో ఏపచెట్లు హెచ్చుగా వున్నవి. ఆంధ్ర ప్రాంతంలో ఈ చెట్లు నిర్మాణంలోను, దళసరితనంలోను, నాణ్యంలోను తెలంగాణావాటికంటె భిన్నంగా ఉంటాయి. వాటి వాటి ఎత్తు, చుట్టుకొలత కూడా తక్కువగానే ఉంటుంది. కొన్నికొన్నిచోట్ల మాత్రం తెలంగాణా చెట్లమాదిరిగానే వుంటవి. ఈ భిన్నత్వానికి కారణాలు సముద్ర మట్టంకంటె భూమి ఎత్తు, వర్షపాతం మొదలైనవి. భూమిఎత్తు సముద్ర మట్టంకంటె 250 అడుగులు మొదలుకొని 5800 అడుగుల వరకు వుంటుంది. వర్షపాతంకూడా 30 అంగుళాలు మొదలు 60 అంగుళాల వరకు వుంటుంది. ఈ ప్రాంతంలో ఈ రకం క్రింద ఈ దిగువ జాతులు కన్పిస్తాయి :

1. బిల్లుడు
2. ఏప
3. చిరిమాను
4. జాడేరి
5. నల్లమద్ది
6. ఏగి (చిట్టంగి)
7. బండారు
8. చెన్నంగి

వీటితోపాటు వెదురుచెట్లు కూడా వుంటాయి. రాయలసీమ జిల్లాలలోని పర్వతప్రాంత వనములలో రక్తచందనం చెట్లున్నవి. ఇది మంచి విలువగల చెట్టు. టేకు చాలా అరుదు. కర్నూలు జిల్లాలోని నల్లమల అడవులలో మాత్రమే టేకుచెట్లున్నవి.

## ఉష్ణప్రాంతపు ముండ్ల అడవులు

వీటిని పొద అడవులని కూడా అంటారు. ఇవి తెలంగాణా ప్రాంతంలోని నల్లగొండ, హైద్రాబాదు, మహబూబ్‌నగర్, నిజామాబాదు, మెదకు జిల్లాలలో వున్నవి. వీటిలో తుమ్మరకాలు, దిరిసెనము, జమ్మి మొదలైనవి వుంటాయి. ఈ అడవుల నాణ్యము, పరిమాణము కూడా హీనంగా వుంటుంది. ఈ అడవులలో వంటచెరుకు, కొద్దిమాదిరి కలపకూడాలభిస్తుంది. ఆంధ్ర ప్రాంతంలోని అడవులు ఎక్కువగా ఇటువంటివే. పంచాయితీల అడవులు, జమీందారీ అడవు లన్నీకూడా ఈ రకానికి చెందినవే. ఆర్థికంగా చూస్తే ఇవి అతిముఖ్యమైన అడవులు. వ్యసాయ అవసరాలకు – నాగలికీ వ్యవసాయ పని ముట్లకూ బండ్లకూ పంటపొలాలచుట్టూ వేసేకంచెలకూ ఈ అడవులే ముఖ్యాధారం. వంటచెరుకు కూడా వీటిలో లభిస్తుంది. పశువుల మేతకు కూడా ఈ అడవులు అనువైనవి.

## ఆకు ఆలములతో పచ్చగావుండే అడవులు

ఇవి కోస్తా ప్రాంతంలో వున్నవి. ఇవికూడా పెద్ద పొదలలాగా వుంటాయి. వీటిని సరిగా సంరక్షించి నట్లయితే బాగా దట్టంగా పెరగగలవు. వీటిలో అగ్ని చాలా అరుదుగా వ్యాపిస్తుంది. ఈ అడవులలో దిగువరకాల చెట్లు వుంటవి.

1. అల్లి
2. ఎర్రుట్టి
3. కాకిబీర
4. బీర
5. పాల
6. మారేడు
7. నల్లబలుసు
8. లోలుగ
9. నెమలెడుగు

పై వాటితోపాటు కంద్రేగు, కలేకాయ, కొరివి, పరికి, దంతి మొదలగుచెట్లు కూడా వుంటాయి.

కోస్తాతీరంలో సర్వీ, జీడిమామిడిచెట్లు పెంచడానికి మంచి అవకాశా లున్నవి.

## సముద్ర తీరపు అడవులు

ఈ అడవులు గోదావరి నదీ ముఖమువద్ద గల ఒండు భూములలోను, వుప్పుటేరు ఎడమ ఒడ్డు

వైపునను వున్నవి. వీటిలో ఈ దిగువ జాతులచెట్లు వుంటాయి :-

మడ, కండ్ల, దుద్దుమార (గుగ్గిలం), తండుగ, తిల్ల మొదలైనవి.

## ఏజన్సీ ప్రాంతం

ఏజన్సీ ప్రాంతం అడవులను గూర్చి పోడు వ్యవసాయాన్ని గూర్చి చెప్పనిదే ఈ వివరణ సమగ్రం కానేరదు. ఏజన్సీప్రాంతం కొండలవరుసలతో కూడుకొని వున్నవి. ఈకొండలు తూర్పు కనుమల తాలూకువి. ఈ ప్రాంతంలో అక్కడక్కడా చెదురువాటుగా కొండలుంటాయి. ఆ కొండలమధ్య శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి రెవిన్యూ జిల్లాలకు సంబంధించిన మైదాన భూము లున్నవి. ఏజన్సీ ప్రాంతం విస్తీర్ణం 5,500 చదరపుమైళ్ళు. ఇందులో 2,354 చదరపుమైళ్ళ ప్రాంతం రిజర్వు అడివి. మిగిలినదానిని కొండ జాతులవారు యథేచ్ఛగా ఎవరి ఆటంకము లేకుండా ఉపయోగించు కుంటూవుంటారు. ఏజన్సీ ప్రాంతం ఒక విధంగా చెప్పాలంటే సులభంగా చొరరాని ప్రాంతం. ఈ ప్రాంతంలో రోడ్లు గనుక వేసినట్లయితే ఇక్కడి కలపను ముఖ్యమైన మార్కెటింగు కేంద్రాలకు రవాణా చేయవచ్చు. ఇచ్చటి కొండ తంగేడుచెట్లు రైల్వే స్లీపర్లకు పనికివస్తాయి. వెదుళ్ళు కూడా ఇక్కడ హెచ్చుగానే వున్నవి. ఇవి కాగితం తయారికి పనికివస్తాయి. ఏజన్సీ అడవులలో విస్తళ్ళాకు, చింతపండు, శీకాయ, పశుగ్రాసం, గుడిసెలకుకప్పే గడ్డి, తేనె, మైనం లభిస్తాయి. ఉత్పత్తికీ, ఆదాయానికీ ఇంతటి మంచి అవకాశాలుగల ఈ అడవులను కొండ జాతులవారు " చిలకపోడు " " కొండపోడు " అను వ్యవసాయాలుచేసి నాశనం చేస్తున్నారు. చదునుగావుండే భూములలో చేయబడే దానిని "చిలకపోడు" వ్యవసాయం అంటారు. ఆరేడేండ్లు చేసిన తరువాత దానిని వదిలేస్తారు. ఏటవాలుగావుండే కొండలపై గుట్టలపై చేసే వ్యవసాయాన్ని "కొండపోడు" అంటారు. దీనిని రెండుమూడేండ్లు చేసి వొదిలేస్తారు. ఈ విధంగా చదును భూములలోనూ, గుట్టలపైననూ ఇష్టమొచ్చినట్లు వ్యవసాయంచేసి తరువాత దానిని వదిలేస్తూ వుండడంవల్ల అడవులు దెబ్బతింటున్నవి. ఈ ప్రాంతాన్ని అభివృద్ధి పరిచే ఉద్దేశంతో 1949 లో ప్రభుత్వం వివిధశాఖల అధికారులతో కూడిన ఒక ప్రవీణుల జట్టును నియమించి, తగు విచారణచేసి నివేదిక సమర్పించవలసిందిగా కోరింది. ఆ జట్టువారి సిఫారసులు క్రమేణా అమలు జరుపబడుతున్నవి.

మొత్తం 24,878.17 చదరపుమైళ్ళ విస్తీర్ణపు అడవిలో తెలంగాణా ప్రాంతంలోని 1,500 చదరపుమైళ్ళు, ఆంధ్రప్రాంతంలోని 5,500 చదరపుమైళ్ళ అడవి నాసిరకపు పొద అడవి. ఇందులో అప్పుడే భూమి కోత ప్రారంభమైంది.

## తెలంగాణా ప్రాంతము

హైద్రాబాదు, నల్లగొండ, మెదకు, మహబూబ్ నగర్, నిజామాబాదు జిల్లాలలో 1500 చదరపుమైళ్ళ కోతపడిన భూములున్నవి. ఈ భూములు క్షీణదశలో వున్నవి. వ్యవసాయ భూములు విస్తృతమవుతూ పోవడంవల్ల ఈ అడవులు దెబ్బతిన్నవి. పైగా అలా అడవిభూములలో వ్యవసాయం చేసి పంట బాగా పండకపోయేసరికి దానిని వొదిలేసి వెడుతూ వుంటారు. ఇట్టిభూములలో ఇప్పుడు ముతకరకపు గడ్డి పెరుగుతున్నది. ఆ గడ్డి కూడా బాగా పెరక్కముందే అసంఖ్యాకమైన పశువులు దాన్ని మేస్తూవుంటాయి. ఇట్టి చెట్లులేని, కోతపడిన భూమిలో ప్రథమ పంచవర్ష ప్రణాళిక కాలంలో తగుచర్యలు గైకొని 35,000 ఎకరాల భూమి సాగుకు లాయకు చేయబడింది. అయితే ఇటువంటి భూమిలో చాలాభాగం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంగా ఇతర రాష్ట్రాలలోకి పోయింది. రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రతి సంవత్సరం 4000 ఎకరాల భూమిలో అడవిని పశుగ్రాసాన్ని పెంచవలెనని సంకల్పించబడింది.

## ఆంధ్రప్రాంతం

చెట్లు లేకుండాపోయిన 5,500 చదరపుమైళ్ళ అడవి ప్రాంతంలోను 200 చదరపుమైళ్ళ అడవి పంచాయితీల అడవి. ఈ పంచాయితీల అడవులు ఒకప్పుడు అటవీశాఖ మేనేజిమెంటుక్రింద వుండేవి.

అడవుల విషయంలో కూడా స్వపరిపాలనను పెంపొందించే ఉద్దేశంతో ఇవి 1922 లో పంచాయితీల మేనేజిమెంటుకు ఇచ్చివేయబడ్డవి. అయితే పంచాయితీలవారు ఈ అడవులను ఇష్టమొచ్చినట్లుగా వినియోగించుకొని, పశువులను మేపి పాడుచేయడంవల్ల 1948 లో ప్రభుత్వం ఆ అడవులను మళ్ళీ అటవీ శాఖ మేనేజమెంటు క్రిందికి తెచ్చింది. ఆంధ్రప్రాంతములో వున్న 8,500 చదరపుమైళ్ళ విస్తీర్ణపు ఎస్టేట్ అడవుల విషయంలో కూడా ఈ విధంగానే జరిగింది. మాజీ జమీందార్లు వాటిని యథేచ్ఛగా ఉపయోగించుకున్నారు. చివరకు పొదలను కంచెలను కూడా నరికివేశారు. అట్టిస్థితిలో ప్రభుత్వం ఈ అడవులను స్వాధీన పరచుకొంది. అట్టి అడవులను సర్వేచేసి, స్వార్థపరులైన వ్యక్తులనుంచి వాటిని కాపాడే ఉద్దేశతో వాటికొక చట్టబద్ధమైన ప్రతిపత్తిని కల్పించడానికై నాలుగు వర్కింగ్ ప్లాన్ పార్టీలు, రెండు స్పెషల్ పార్టీలు నియమింపబడి పనిచేస్తున్నవి. అయితే ఈ పనికి కూడా కొంత ఆటంకం కలుగుతున్నది. ఎవరోవచ్చి విజ్ఞాపనలు అందజేస్తారు. ఏదో జరుగుతుందని భయం, అనుమానం వెలిబుచ్చుతారు. అందుచేత ముఖ్యమైనటువంటి ఈ పని సరిగా జరగడంలేదు. ఈ పని పూర్తి అయింతరువాత పార్టీలు వర్కింగ్ ప్లానును తయారుజేస్తవి. అప్పుడు ఈ అడవులకు తగు విరామమిచ్చి మళ్ళీ అవి బాగా పెరగడానికి అవకాశ మివ్వబడుతుంది.

తెలంగాణా ప్రాంతంలోని ఎత్తైన అడవుల స్థితిగతులను అభివృద్ధి పరచడానికై సరికొత్త, సశాస్త్రీయ ప్లానులను తయారుచేయడంలో మూడు వర్కింగ్ ప్లాన్ పార్టీలు నిమగ్నమై వున్నవి. ఆర్థికంగా లాభసాటియైన జాతుల చెట్లను పెంచి, నిర్లక్ష్యం చేయబడిన ప్రాంతాలపట్ల తగు శ్రద్ధవహించి వాటిలో చెట్లు పెంచినట్లయితే రాష్ట్ర ప్రకృతిసంపద అభివృద్ధి చెందగలదు.

కోతపడి వొరుసుకుపోయిన భూములను, చెట్లు లేకుండాపోయిన గట్టలను బాగ చేసి, ఆంధ్రప్రదేశ్ లో నదులను తగుపథంగా అరికట్టి, కోస్తా తీరాలలో గాలికి వచ్చే ఇసుకమెట్టలను అరికట్టడానికై అటవీ శాఖక్రింద గల అటవీ పరిశోధనా విభాగం ఇటీవల పెంచబడింది. ఇప్పుడు పెరుగుతున్న చెట్ల జాతుల విషయంలో వాస్తవమైన సంఖ్యలను సేకరించడం, ఇప్పుడూ ఇకముందూ పెంచవలసిన లాభసాటి జాతులను ప్రచారం చేయడం - ఇవి ప్రస్తుత కార్యక్రమాలు.

అటవీ శాఖయొక్క వినియోగ విభాగం పునర్వ్యవస్థీకరింప బడుతున్నది. లోగడ నిరుపయోగకరమైన జాతులనిచెప్పి పరిగణింప బడినవాటికి మార్కెటు కల్పించేపనిని ఈ విభాగం పరిశీలిస్తున్నది. కలప సంరక్షణకు, సరఫరాకు సంబంధించిన అంశాలను కూడా ఈ విభాగం పరిశీలించగలదు.

ఆంధ్ర ప్రదేశ్ యొక్క స్వల్ప అటవీ సంపదను ఇంకా శాస్త్రీయంగా అభివృద్ధి పరచవలసి వున్నది. ఔషధాలకు పనికొచ్చే వనమూలికలు, గుగ్గిలం, తోళ్ళ ఊనకానికి పనికొచ్చే తంగేడు మొదలగు చెక్కలు, బంక, అద్దకపు రంగులకు పనికొచ్చే పదార్థములు, నారలు, బూరుగుదూది, బీడీ ఆకు, శీకాయ, జీడిగింజలు, తేనె, మైనం మొదలగునవి మన అడవులలో లభిస్తాయి. వాటిని సరిగా సేకరించి, విక్రయావకాశాలు కలిగించవలసి వున్నది. వీటిని కుటీర పరిశ్రమల ప్రాతిపదికపై అభివృద్ధి పరచవలసి వున్నది. అప్పుడు ఆదాయం లభిస్తుంది. కొంతమందికి పనులుకూడా దొరుకుతవి. జీడ మామిడి, లక్క మొదలగు వాటివల్ల మనకు డాలర్లు లభించే అవకాశం వుంది. అందుకని వాటి సంరక్షణ విషయంలో ఇటీవల కొంత శ్రద్ధ కనిపిస్తున్నది. ఈ విషయంలో తగు కృషి చేసినట్లయితే రాష్ట్రాదాయం పెరగగలదు.

## అటవీశాఖ ఆదాయవ్యయాలు

1956-57 సంవత్సరంలో అటవీశాఖపై మొత్తం రూ 2,21,04,810 ల ఆదాయం వచ్చింది. ఇందులో తెలంగాణా ప్రాంతంనుంచి రూ 1,55,67,466 లు, ఆంధ్ర ప్రాంతంనుంచి రూ 67,37,344 లు లభించాయి. తెలంగాణా ప్రాంతంలో సిబ్బందిపైన, ఇతర ఖర్చులకుగాను రూ 27,28,857 లు, ఆంధ్ర ప్రాంతంలో రూ 38,97,422 లు ఖర్చు అయినవి అంటే ఆదా

[తరువాయి 44 పేజీలో]

# వార్తా చిత్రాలు



రాష్ట్ర వ్యవసాయ మంత్రి శ్రీ వి. తిమ్మారెడ్డి ఇటీవల బాపట్లలోని జీడిమామిడి పరిశోధన కేంద్రాన్ని దర్శించారు. చిత్రంలో మంత్రిగారు అచట ప్రదర్శింపబడిన వస్తువులను చూస్తున్నారు.



రష్యాకు ఎగుమతిచేయడానికై హైద్రాబాదులో తయారుచేయబడిన కాలిజోళ్ళ నమూనాలు.



దక్షిణ ప్రాంతపు సర్వసైన్యాధికారి లెఫ్టినెంట్ జనరల్ పి. యస్. థాపార్ నగరానికి విచ్చేసిన సందర్భంలో ఇచటి సైనిక దళాలను తనిఖీ చేశారు.



ఇటీవల శ్రీ బల్వంతరాయ్ మెహతా నాయకత్వాన కొందరు ప్రముఖులు రాష్ట్రంలోని కొన్ని సామాజికాభివృద్ధి ప్రాంతాలను, జాతీయ విస్తరణ సేవాకేంద్రాలను పరిశీలించారు. ఇది వారు కరప్పగ్రామం సందర్శించిన సందర్భంలో తీయబడిన చిత్రం. (ఇది తూర్పుగోదావరి జిల్లాలో అనంతర తీవ్రకృషి గ్రామం.)



అఖిలాంధ్ర ఉద్యానకృషి ప్రదర్శనం-ఆంధ్రప్రదేశ్ వ్యవసాయమంత్రి శ్రీ వి. తిమ్మారెడ్డి 10-6-1957 తేదీన కాకినాడలో అఖిలాంధ్ర ఉద్యానకృషి నాల్గవప్రదర్శనానికి ప్రారంభోత్సవంచేస్తున్నదృశ్యం. ప్రారంభోత్సవ సభకు అధ్యక్షతవహించిన యూనియన్ డిప్యూటీమంత్రి శ్రీ ఎ. జె. థామస్ ఎడమచివరన వున్నారు.



దక్షిణప్రాంతపు సర్వసైన్యాధికారి లెఫ్టినెంట్ జనరల్ వి. యస్. థాపార్ 27-6-'57 తేదీన హైద్రాబాదు సమీపంలో గల గోలకొండలోని ఫిరంగీల యూనిట్లను తనిఖీచేశారు.



రాష్ట్ర శాసన సభ్యులు శ్రీ జె. వి. ముత్యాలరావు 12-6-1957 తేదిన
డా. వి. రామకృష్ణారావుగారి గౌరవార్థమై తేనీటి విందు చేశారు.



విశాఖపట్నంలో డాల్ఫిన్స్‌నోస్ లైట్ హౌస్‌కు యూనియన్ ప్రభుత్వ తంతితపాలా, రవాణామంత్రి
శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి 1957 జూన్ 15 వ తేదీన ప్రారంభోత్సవం చేశారు.
చిత్రంలో శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి స్విచ్ వేసి లైట్ హౌస్ దీపాలు వెలిగిస్తున్నారు.



దక్షిణప్రాంతపు సర్వసైన్యాధికారి లెఫ్టినెంట్ జనరల్ పి. యస్. థాపార్ 27-6-1957 తేదీన గోలకొండలోని వివిధ ఫిరంగుల యూనిట్లను తనిఖీచేశారు. చిత్రంలో శ్రీ థాపార్ సైనికుల బారకాసులను పరిశీలిస్తున్నారు.



దక్షిణప్రాంతపు సర్వసైన్యాధికారి లెఫ్టినెంట్ జనరల్ పి. యస్. థాపార్ 27-6-57 తేదీన గోలకొండలోని వివిధ ఫిరంగుల యూనిట్లను తనిఖీచేశారు. ఈ చిత్రంలోవారు విమానాలను పడగొట్టే తుపాకీయంత్రం ఎలాపనిచేసేదీ పరిశీలిస్తున్నారు.



*10-6-1957* తేదీన షాద్‌నగర్ సమీపాన కొందుర్గు జాతీయ విస్తరణ సేవాకేంద్రానికి ప్రారంభోత్సవం చేసిన
పిదప గ్రామస్థుల సభలో రాష్ట్రప్లానింగ్ మంత్రి శ్రీ వి. బి. రాజు ప్రసంగిస్తున్న దృశ్యం.



ఆంధ్రప్రదేశ్ నీటిపారుదల, విద్యుచ్ఛక్తి శాఖామంత్రి శ్రీ జె. వి. నరసింగరావు *9-6-1957* తేదీన
హైదరాబాదులో ఆంధ్ర ఇంజనీరింగుసంఘం తృతీయవార్షిక మహాసభలో ప్రారంభోపన్యాసమిస్తున్న దృశ్యం.



హైదరాబాదులో జనతా ఇన్సూరెన్సు పాలసీలకు రాష్ట్ర రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావు 9-6-57 తేదీన ప్రారంభోత్సవం చేశారు.



అఖిలాంధ్ర ఉద్యానకృషి నాల్గవ ప్రదర్శనంలో గెలుపొందినవారికి తూర్పుగోదావరి జిల్లా కలెక్టర్ సతీమణి శ్రీమతి కృష్ణస్వామి బహుమతు లందజేస్తున్న దృశ్యం.



హైదరాబాదుకు ఎనిమిదిమైళ్ళ దూరంలో వున్న హఫీజ్‌గూడాలో ప్రభుత్వంచేసిన ఆర్థికసహాయంతో హరిజనులు నిర్మించుకుంటున్న హరిజనవాడ దృశ్యం.



ఇటీవల పార్లమెంటు సభ్యులు శ్రీ బలవంతరాయ్ మెహతా నాయకత్వాన ఒక పరిశీలక బృందం ఆంధ్రప్రదేశ్‌లోని కొన్ని సామాజికాభివృద్ధి ప్రాజెక్టులను, జాతీయవిస్తరణ సేవాకేంద్రాలను పరిశీలించింది. చిత్రంలో పరిశీలక బృందం సభ్యులు తూర్పుగోదావరిజిల్లాలోని చెల్లూరు వంతెనను చూస్తున్నారు. ఈ వంతెనను జాతీయ విస్తరణ సేవా కార్యక్రమంక్రింద గ్రామస్థులే నిర్మించుకున్నారు.

# ఆంధ్రప్రదేశ్ రైతులు

శ్రీ ఐ. జె. నాయుడు, ఐ. ఏ. యస్.
(వ్యవసాయశాఖ డైరెక్టరు)

మళ్ళీ దేశంలో అధికాహారోత్పత్తి జరగవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కాబట్టే ఈనాడు అందరిదృష్టీ రైతుమీద వుంది. ఆహార కొరతను తీర్చడంలో ఆంధ్రరైతు వహించిన పాత్ర అసమాన మైనది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ వ్యవసాయశాఖ డైరెక్టర్ శ్రీ ఐ. జె. నాయుడు ఆంధ్ర రైతులనుగూర్చి, వారి దైనందిన జీవితాన్నిగూర్చి సమగ్రమైన వ్యాసం రచించారు. అందులోనుంచి మొదటిభాగాన్ని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

భారతదేశంలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ననుసరించి నవంబరు 1 వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడింది. ఈ రాష్ట్రంలో పూర్వపు ఆంధ్ర రాష్ట్రంలోని 11 జిల్లాలు, పూర్వపు హైద్రాబాదు రాష్ట్రములో తెలంగాణా అనబడే ప్రాంతములోని తొమ్మిది జిల్లాలు, ఆరు తాలూకాలు చేరివున్నవి. పరిపాలనా రీత్యా చూచినా, వ్యవసాయ విషయకంగా చూచినా ఈ రెండు ప్రాంతాల ఏకీకరణకు ఎంతో ప్రాముఖ్యం వున్నది. దీని వల్ల భారీనదీ లోయ ప్రాజెక్టులను నిర్మించడానికీ, ఇతర ప్రకృతి సంపదలను లాభసాటిగా వినియోగించుకోవడానికీ వీలుకలుగుతుంది. 1,06,041 చదరపు మైళ్ళ విస్తీర్ణం, 312 లక్షల జనాభాతో ఆంధ్రప్రదేశ్ భారతదేశంలోని రాష్ట్రాలలో విస్తీర్ణం రీత్యా ఐదవ స్థానం, జనాభా రీత్యా నాల్గవ స్థానం ఆక్రమిస్తున్నది.

ఈ రాష్ట్రంలో వ్యవసాయమే ప్రజల ముఖ్య వృత్తి. ఇక్కడి జనాభాలో నూటికి 67.4 వంతుల మంది జీవనోపాధికొరకు వ్యవసాయంపై ఆధారపడివున్నారు. దేశ జాతీయాదాయంలో నూటికి 58 వంతులు వ్యవసాయం ద్వారానే లభిస్తున్నది. 1955-56 సంవత్సరంలో వ్యవసాయంద్వారా రూ. 823 కోట్ల ఆదాయం లభించింది. భారత దేశ జాతీయాదాయంలో దాదాపు సగం (50 శతి) దేశం మొత్తంపై జరుగుతున్న వ్యవసాయం ద్వారా లభిస్తున్నది. కనుక వ్యవసాయ దృష్ట్యా చూచినట్లయితే దేశం యొక్క గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రతిపత్తి గర్వకారణమైనది. ఆహార ధాన్యాల విషయంలో ఇది మిగులు రాష్ట్రం. ఇతర కొరతరాష్ట్రాలకు ఇక్కడి నుంచి ఆహార ధాన్యాల సరఫరా జరుగుతూవుంది. దీనిని "భారత దేశ ధాన్యాగారం" అంటే అతిశయోక్తి కాదు, పైగా అత్యంత సమంజసం. అంతర్జాతీయ మార్కెట్ల నుంచి డాలర్లు సంపాదించే వేరుశనగ, ఆముదాలు వర్జీనియా పొగాకు వంటి వాణిజ్యపంటల విషయంలోనేగాక ప్రత్తి, మిరపకాయ, చెఱకు, పసుపు, ఉల్లిగడ్డలు, పండ్ల విషయంలో కూడా ఆంధ్రప్రదేశ్ మిగులు రాష్ట్రం. వర్జీనియా పొగాకు విషయంలో ఈ రాష్ట్రం దాదాపు గుత్తా పుచ్చుకున్నదని చెప్పాలి. దేశం మొత్తంలో పొగాకు వేయబడుతున్న భూమిలో దాదాపు నూటికి 95 వంతుల భూమి ఆంధ్రప్రదేశ్‌లోనే వున్నది. ఇక పండ్లవిషయములో పంట వేయబడేభూమి, ఉత్పత్తి ఎగుమతి చేయడానికి లభించే మిగుల్లు, నాణ్యమైన రకాలు— వీటిదృష్ట్యా చూచినట్లయితే భారతదేశ పండ్లతోటల చిత్రపటంలో ఆంధ్ర ప్రదేశ్‌కు ముఖ్యమైన స్థానమున్నది. ఆముదాలు కూడా ఈ రాష్ట్రంలో బాగా పండుతున్నవి. భారతదేశంలో ఆముదాల పైరు వేయబడే భూమిలో నూటికి 70 వంతుల భూమి, భారతదేశంలో పండే మొత్తం పంటలో నూటికి 50 వంతుల పంట ఆంధ్రప్రదేశ్‌లోనే ఉంటున్నవి.

భారతదేశంలోని రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్‌ను "నదుల రాష్ట్రం" అనికూడా అనవచ్చును. గోదావరి, కృష్ణ, తుంగభద్ర, పెన్నార్‌వంటి పెద్దనదులు, మూసీ, పెనుగంగ వంటి అనేక చిన్ననదులు ఈ రాష్ట్రంలో ప్రవహిస్తున్నవి. ఈ నదీ జలాలను సక్రమంగా వినియోగానికి తెచ్చుకున్న

## ఆంధ్రప్రదేశ్ యొక్క కొండలు మరియు నదులు సూచించు పటము.



ట్లయితే భారతదేశం మొత్తం. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం వ్యవసాయకంగా సిరిసంపదలతో తులతూగ గలవు. ఇప్పటికికూడా ఇతరరాష్ట్రాలకంటే ఆంధ్రప్రదేశ్ లోనే చక్కని నీటిపారుదల వసతులు గలవు. ఇచ్చట పైర్లు వేయబడేభూమిలో నూటికి 24.7 వంతుల భూమికి నీటిపారుదల సౌకర్యాలున్నవి. ఎక్కువగా కాలువలు, చెరువులు ముఖ్య జలాధారాలు.

ఆంధ్రరైతులు అభ్యుదయ దృష్టిగలవారు. రాజకీయంగా చైతన్యం గలవారు. నూత్నంగా ఏర్పడిన ఈ రాష్ట్రం సత్వరమే సర్వతోముఖంగా అభివృద్ధి గాంచవలెననే వాంఛగలవారు. పూర్వకాలంనుంచీ వారు సాంప్రదాయిక పద్ధతుల ప్రకారం వ్యవసాయం చేస్తున్నప్పటికీ ఇటీవల వ్యవసాయంలో ప్రవేశపెట్టబడిన ఆధునిక పద్ధతులు వారిదృష్టిపై తగు ప్రభావం వేసి వారిలో నవీన దృక్పథాన్ని కలిగించినవి. ఆంధ్ర రైతులకు రసాయనిక ఎరువులంటే తగని అభిమానం అని అందరికీ తెలుసు. ముఖ్యంగా సల్ఫేట్ ఆఫ్ అమోనియా అనే ఎరువును వీరు అనేకరకాల పైరులకు వాడుతారు. కనుకనే భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే హెచ్చుగా రసాయనిక ఎరువులను వాడుతుందని ప్రతీతి. అసలు విషయంకూడా అంతే. క్రిమికీటకాదులనుంచి, తెగుళ్ళనుంచి పైరుపంటలను కాపాడవలసిన ఆవశ్యకతను ఇచటి రైతులు గుర్తించి శాస్త్రీయమైన రోగనివారక పద్ధతులను అవలంబిస్తున్నారు. మొక్కల సంరక్షణ విషయంలో ఆంధ్రప్రదేశ్ బాగా ముందంజవేసిన రాష్ట్రాల లెక్కలోకి వస్తుంది.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగిసే నాటికి ఈ రాష్ట్రంలో పైర్లు వేయబడే భూమి 22.6 లక్షల ఎకరాలు పెరిగింది. అంటే నూటికి 8.8 వంతుల పెరుగుదల అన్నమాట. నీటి పారుదలవల్ల సాగయ్యే నికరభూమి కూడా నూటికి 16 వంతులు పెరిగింది. రైతులు అవలంబించిన అనేక అభివృద్ధి కార్యకలాపాల ఫలితంగా ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగిసేనాటికి అదనంగా దాదాపు 33 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు పండినవి. అంటే 1950-51 సంవత్సరపు ఉత్పత్తిమీద దాదాపు నూటికి 30 వంతుల పెరుగుదలన్నమాట. ఈ రాష్ట్రంలో వరి, జొన్న, మిరపకాయ, పొగాకు, చెరకు మొదలగు ప్రధానమైన పంటల సగటుదిగుబడి కూడా దేశం మొత్తంమీది సగటుల కంటె చాలా హెచ్చుగా వున్నది.

వ్యవసాయాభివృద్ధి కార్యక్రమంలో ఆంధ్ర రైతులు హెచ్చు శ్రద్ధవహించి జాతీయసంపద వృద్ధిచెందడానికి ఎంతగానో తోడ్పడుతున్నారు. వారికి ఇంకను సాంకేతిక సలహాలు, ఆర్థిక సహాయం లభింపజేసి తగు ప్రోత్సాహమిచ్చినట్లయితే దేశంయొక్క లక్ష్యమైనటువంటి సంపత్సమృద్ధులను సాధించడంలో మన రైతులు ఎవ్వరికీ తీసిపోరు.

## నైసర్గిక స్థితి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం భారతదేశానికి ఆగ్నేయదిశన ఉష్ణ ప్రాంతంలో వున్నది. ఈ రాష్ట్రం 13° మొదలు 20° అక్షాంశము, 77° మొదలు 85° వరకు రేఖాంశములమధ్య వున్నది. తూర్పున బంగాళాఖాతం, ఉత్తరాన ఒరిస్సా మధ్యప్రదేశ్ రాష్ట్రాలు, పశ్చిమాన బొంబాయి మైసూరు రాష్ట్రాలు, దక్షిణాన మద్రాసు రాష్ట్రం దీనికి ఎల్లలుగావున్నవి. తూర్పున బంగాళాఖాతపు కోస్తాతీరం, ఉత్తరాన శ్రీకాకుళం జిల్లాలోని ఇచ్ఛాపురం మొదలు దక్షిణాన నెల్లూరు జిల్లాలోని సూళ్ళూరుపేట వరకు దాదాపు 600 మైళ్ళ దూరం వరకు విస్తరించి వున్నది. అంటే భారతదేశ కోస్తాతీరంలో ఆరోపంతు అన్నమాట. ఇక ముఖ్యమైన పర్వతశ్రేణులు ఇవి. కోస్తా జిల్లాలలో తూర్పు కనుమలు: ఇవి 2 వేలు మొదలు 4 వేల అడుగుల ఎత్తువరకు వున్నవి. రాయలసీమలోని నల్లమల కొండలు, ఇవి వేయి మొదలు నాలుగువేల అడుగుల ఎత్తు వరకు వున్నవి. కందికల్‌గుట్ట లేక సర్నపల్లి శ్రేణి వరంగలు జిల్లా నుంచి పశ్చిమోత్తరదిశన ఆదిలాబాదు జిల్లాలోని చెన్నూరు తాలూకాగుండా పోతుంది. సహ్యాద్రి పర్వతశ్రేణి నిర్మల్‌నుంచి ఉత్తరదిశకు వ్యాపించి వున్నది. పోతే ముఖ్యమైన నదులు కృష్ణా గోదావరులు. ఇవి బొంబాయి రాష్ట్రంలోని పశ్చిమ కనుమలలో పుట్టి ఆంధ్రదేశంగుండా ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తున్నవి. ఆ తరువాత చెప్పుకోదగింది తుంగభద్ర. ఇది కృష్ణకు ఉపనది. ఇవి గాక పెన్నార్, బుడమేరు, వంశధార, నాగావళి, బాహుద, పెనుగంగ నదులు కూడా కలవు. అయితే పెద్దనదులు పోయినకొద్దీ నీటి పారుదలకూ, పడవల రవాణాకూ అనుకూలంగా లేవు. కాని మధ్యన మైదాన భూములలో ఈ నదులు సాగునీటికీ పడవల రవాణాకూ ఎంతో సదుపాయంగా వున్నవి. ఆంధ్రప్రదేశ్ భూప్రాంతమంతా కొండలతోను, సరస్సులతోను, చెరువులతోను, మైదాన భూములతోను, పీఠ భూములతోను చూచుటకు

## ఆంధ్రప్రదేశ్ యొక్క భూమి మరియు వర్షపాతమును సూచించు పటము.




వైవిధ్యంతో అలరారుతున్నది. దీని నైసర్గికస్థితి ఈ విధంగా వుండడానికి కారణమేమంటే తూర్పు కనుమలు కోస్తావైపుకు ఏటవాలుగా వున్నవి. నల్లమల కొండలు పడమటి వైపుకు ఏటవాలుగా వున్నవి. కందికల్ గుట్ట ఉత్తరంవైపుకు ఏటవాలుగా వున్నది. భూగర్భరీత్యా కూడా ఈ రాష్ట్రం వైవిధ్యవిలసితమైంది. ఒక చోట వున్నభూమి మరొకచోట లేదు. మధ్యప్రాంతపు పీఠభూమి సోడా ఫెల్స్పార్, నల్లసీసపురాయి, నీయిస్‌శిల మొదలగు ఫెర్రో, మాగ్నీషియంతో కూడుకొని వున్నది. ఉత్తర ప్రాంతంలో ఖోండలైట్, చార్నొకైట్ శిలలున్నవి. నెల్లూరు జిల్లాలోని వెలుగొండలలో, కర్నూలు జిల్లాలోని నల్లమల కొండలలో శ్రీకాకుళం జిల్లాలోని బాలకొండల్లో క్వార్టుజైటుషేలు వున్నవి. కృష్ణానదికి దక్షిణప్రాంతం మొదలు మధ్య పీఠ భూమికి చెందిన కర్నూలు, కడపజిల్లాలలో చాలా భాగంలో సున్నపురాయి, బంకమట్టి సంబంధమైన రాయి ( వింధ్య యుగమునకు చెందినది ) కలదు. ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలలో దక్కన్ పీఠభూమికి సంబంధించిన శిలలు కన్పిస్తాయి. కృష్ణా, గోదావరి, పెన్నార్‌నదీ లోయలలో ఒండుమట్టి భూములున్నవి. రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో స్థానికమైన తురకరాతి భూము లున్నవి.

## భూములు

ఆంధ్రప్రదేశ్ భూములను ఆరు ముఖ్య రకాలుగా విభజించ వచ్చును: 1. ఒండుభూములు. 2. రేగడిభూమి. 3. ఎర్రనేలలు. 4. తురకరాతి భూములు. 5. ఇసుకపర్రలు 6. చలక భూములు.

ఒండుభూములు డెల్టాప్రాంతాలలోను. నదీతీరములందును వున్నవి. ఇవి మిగుల సారవంతమయిన భూములు. ఈ భూములలో వరి, చెరకు, అరటి మొదలగు పంటలు పండుతవి. రేగడిభూములు హెచ్చుగా కర్నూలు, కడప, గుంటూరు, కృష్ణాజిల్లాలలోను, మహబూబ్‌నగర్, నిజామాబాద్‌జిల్లాలలోని కొన్నిప్రాంతాలలోను వున్నవి. ఇవి ప్రత్తి, జొన్న, నూనెగింజల పైరులకు అనువైనభూములు. ఇవి తేమవుండే భూములు. వీటిలో సున్నం వుంటుంది. ఇవి పీల్చుశక్తి, మారకస్వభావంకూడా కలిగివుండి సాధారణంగా సారవంతంగా వుంటాయి. అనంతపురం, కర్నూలు, కడప, చిత్తూరు, నెల్లూరు జిల్లాలలోను, హైద్రాబాదు, మెదకు జిల్లాలలోని కొన్ని ప్రాంతాలలోను ఎర్రనేలలున్నవి. ఇవి సాధారణంగా ఇసుక భూములు. వీటి భూమి గట్టిగాకాక తేలికగా వుంటుంది. వీనిలో మొక్కలకు కావలసిన ఆహారపదార్థములు చాలా తక్కువగా వుంటవి. ఇసుకపర్రలు కోస్తాతీరంలో వున్నవి. ఇవి సారవంతమైన భూములు కావు. చలక భూములుకూడా ఎర్రగా వుంటవి. వీటిలో సున్నం కలిసి వుంటుంది. తెలంగాణాజిల్లా లన్నింటిలో చలకభూములున్నవి. ఇవికూడా అంత సారవంతమైన భూములు కావు. వీనిలో లవణగుణము తక్కువగా వుంటుంది. వర్షాధారంవల్ల పండేపంటలకూ సాగు నీటివల్ల పండే పంటలకూ ఈ భూములు అనువైనవి.

## పైరు పంటలు

ఆంధ్ర ప్రదేశ్‌లో పైర్లు వేయబడు భూములు సాధారణంగా మూడు విధాలుగా వుంటాయి. 1. మాగాణిభూములు 2. మెట్టభూములు, 3. తోటలు. మాగాణిభూములలో వరి, చెరకు వేయబడుతాయి. ఈ భూములకు, నమ్మకంగా సాగునీరు లభించే నీటి వనరులైన ప్రభుత్వ కాలువలవల్ల నీరు సరఫరా అవుతుంది. మెట్టభూములలో జొన్నలు, పప్పుధాన్యాలు, పొగాకు, వేరుసెనగ, ఆముదాలు, మిరపకాయ, ప్రత్తిమొదలైనవి పండుతాయి. తోటలలో బావుల క్రింద రాగులు, అరటి, కూరగాయలు, పండ్లు మొదలైనవి పండించబడుతాయి.

ఈ రాష్ట్రంలో వరి ముఖ్యమైన పంట. ప్రజలుకూడా హెచ్చుగా వరి బియ్యమే ఆహారానికి వాడతారు. డెల్టా ప్రాంతాలలో కాలువల క్రింద వరి ఎక్కువగా పండుతుంది. కొన్ని ప్రాంతాలలో బావుల క్రింద, చెరువుల క్రిందకూడా వరి పండుతున్నది. కొన్నిచోట్ల ఏడాదికి రెండు పంటలు కూడా వేయబడుతున్నవి.

పైరు వేయడానికి ముఖ్యమైన వ్యవసాయ సీజనులు రెండు వున్నవి. ఒక పంట జులై - ఆగష్టులో నాట్లువేసి డిసెంబరు - జనవరిలో కోతలు కోస్తారు. (దీనినే సరవ పంట అంటారు.) రెండవది కొద్దికాలపు పంట. ఈ పంటకు జనవరి - ఫిబ్రవరిలో నాట్లువేసి ఏప్రిల్ - మేలో కోస్తారు. (దీనిని దాళవాపంట అంటారు.) ఒక పంట మాత్రమే వేసే భూములలో కోతలైన తరువాత జనుము, పిల్లిపెసర, పచ్చపెసర, మినుము వంటి పైర్లు వేస్తారు.

నాట్లువేసే కాలానికి ముందుగానే నారుమళ్ళు పెంచుతారు. పొలాలకు ఎరువువేసి దమ్ముచేసిన తరువాత నాట్లు వేస్తారు. నాట్లువేసే పనిని ఎక్కువగా స్త్రీలే నిర్వహిస్తారు. పొలంలో రెండు మూడుసార్లు కలుపుతీసిన తరువాత పైరుకు రసాయనిక ఎరువులు వేస్తారు. కంకులు పండి పంట కోతకురాగానే మళ్ళల్లోవున్న నీటిని వదిలేసి పంట కోసేస్తారు. దానిని కట్టలుకట్టి ఎండబెట్టి ఆ తరువాత బల్లల మీదవేసి కొట్టి, పశువులచేత తొక్కించి నూర్చుతారు.

జొన్న : కొన్ని ప్రాంతాలలో రైతులు జొన్నన్నం తింటారు. మెట్టప్రాంతాలలో జొన్న ముఖ్యమైన పంట. ఋతుపవనాలు మొదలై వర్షాలు ఆరంభంకాగానే జొన్న, కొర్ర, సజ్జ, సాములు, ఇతర అల్పధాన్యాల పైర్లు వేస్తారు. మూడు లేక నాలుగు నెలల తరువాత వీటికోతలు జరుగుతవి. రాగిపంట సాధారణంగా బావులక్రింద పండిస్తారు. జొన్నచేలలో జొన్నవిత్తనాలతోపాటు కందులు, పెసలు, మినుములుకూడా వేస్తారు. అయితే సెనగలు, ధనియాలు మొదలగు పైరులను ప్రత్యేకంగా చలికాలంలో వేస్తారు. అయితే ప్రత్తిచేలో జొన్నకూడా వేయడంకద్దు.

నూనెగింజలు : వేరుసెనగ, ఆముదాల పైర్లను మెట్ట భూములలో వేస్తారు. నువ్వులు మెట్టపంటా, మాగాణి పంటాకూడా. తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, శ్రీకాకుళం జిల్లాలలో కొబ్బరితోట లున్నవి. ఈ జిల్లాలలో కొద్దిగా పోకల పంటకూడా కలదు.

చెఱకు : ఇది మాగాణిపంట. ఇది చాలా ముఖ్యమైన వాణిజ్య పంట.

ఆంధ్రప్రదేశ్ యొక్క విస్తీర్ణము, మరియు జనాభా సూచించు పటము.



పొగాకు : మన వాణిజ్య పంటలలో ఇది చాలా ముఖ్యమైనది. ఇండియన్ వర్జీనియా పొగాకులో హెచ్చు భాగం ఆంధ్రప్రదేశ్‌లోనే పండుతుంది. ఇది గుంటూరు, కృష్ణా, పశ్చిమ గోదావరి జిల్లాలలో ఎక్కువగా పండుతున్నది.

మిరపకాయ : ఇది కూడా ముఖ్యమైన వాణిజ్య పంట. దీనివల్ల కూడా వ్యవసాయదార్లకు మంచి ఆదాయం లభిస్తుంది. మిరప మొక్కలను అక్టోబరు - నవంబరు నెలల్లో నాటి జనవరి - ఫిబ్రవరి నెలల్లో కోస్తారు.

పండ్లు : భారతదేశ రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ కూడా ఫలాలకు ప్రసిద్ధి కెక్కినది. ఇక్కడ మామిడి, నారింజ, సపోటా, ద్రాక్ష, పనస, అరటి, జామ మొదలగు పండ్లు విరివిగా లభిస్తాయి. కడపజిల్లా కోడూరులో పండ్లను భద్రపరిచే ఫ్యాక్టరీకలదు. అందులో పండ్లరసాలు, స్క్వాషులు తయారు చేయబడుతవి.

## 1954-55 లో ఆంధ్రప్రదేశ్, ఇండియాలలో పంటలక్రిందగల భూమివిస్తీర్ణం, ఉత్పత్తుల వివరాలు:

| వరుస సంఖ్య | పంటల పేర్లు | భూమి (1000 యెకరములలో) ఆంధ్ర ప్రదేశ్ | ఇండియా | ఉత్పత్తి (1000 టన్నులలో) ఆంధ్ర ప్రదేశ్ | ఇండియా | 4 వ కాలంకు 3 వ కాలమ్ ఎంతశాతం? | 6 వ కాలంకు 5 వ కాలమ్ ఎంతశాతం? |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| I. | పంటలక్రిద నున్న మొత్తం భూమి | 29,419 | 3,52,358 | .... | .... | 8.3 | .... |
| II. | ఆహార పంటలక్రింద నున్న భూమి | 22,530 | 2,80,648 | .... | .... | 8.0 | .... |
| 1. | బియ్యం | 6,399 | 74,424 | 3,090 | 24,209 | 8.6 | 12.8 |
| 2. | గోధుమ | 37 | 26,842 | 6 | 8,539 | .... | .... |
| 3. | జొన్న | 5,880 | 43,456 | 1,090 | 9,092 | 13.5 | 12.1 |
| 4. | సజ్జ | 1,615 | 27,350 | 332 | 3,555 | 5.9 | 9.3 |
| 5. | చోడి | 821 | 5,747 | 341 | 1,778 | 14.3 | 19.2 |
| 6. | మొక్కజొన్న | 464 | 9,325 | 76 | 2,944 | 5.0 | 2.6 |
| 7. | బార్లీ | 10 | 7,999 | 1 | 2,786 | .... | .... |
| 8. | ఇతర మెట్టధాన్యాలు, కాయధాన్యాలు | 2,978 | 13,680 | 441 | 2,424 | 21.7 | 11.6 |
| 9. | సెనగలు | 287 | 20,991 | 42 | 5,125 | 1.4 | 0.8 |
| 10. | కందులు | 377 | 5,944 | 40 | 1,661 | 6.3 | 2.5 |
| 11. | ఇతర పప్పు దినుసులు | 2,490 | 27,069 | 204 | 3,688 | 9.2 | 5.6 |
| 12. | చెరకు | 175 | 3,932 | 503* | 5,549 | 4.5 | 9.0 |
| 13. | మిర్చి | 425 | 1,472 | 106 | 356 | 28.9 | 29.8 |
| 14. | మరొకచోట చేర్చబడని యితర ఆహార పంటలు | 439 | .... | .... | .... | ... | .... |

*చెరకుతో సమానమైన బెల్లం రూపంలో

| వరుస సంఖ్య | పంట పేరు | భూమి (1000 యెకరాలలో) ఆంధ్ర ప్రదేశ్ | ఇండియా | ఉత్పత్తి (1000 టన్నులలో) ఆంధ్ర ప్రదేశ్ | ఇండియా | 4 వ కాలంకు 3 వ కాలం ఎంతశాతం? | 6వకాలంకు 5 వ కాలం ఎంతశాతం? |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 15. | ఉల్లిపాయలు | 44 | .... | 166 | .... | .... | .... |
| 16. | కొబ్బరికాయలు (కొబ్బరి) | 84 | .... | 45 | .... | .... | .... |
| 17. | జీడి మామిడి | 5 | .... | 1 | .... | .... | ... |
| | ఆహారేతర పంటలక్రింద భూమి | 6,889 | 77,710 | .... | .... | 9.6 | .... |
| ఎ. | మొత్తం నూనెగింజలు | 4,889 | 29,336 | 1,190 | 5,877 | 16.7 | 20.2 |
| | ఎ. వేరుసెనగ | 3,110 | 12,647 | 1,053 | 3,823 | 24.6 | 27.5 |
| | బి ఆముదాలు | 883 | 1,273 | 63 | 112 | 69.4 | 56.3 |
| | సి. ఎల్లగిసెగింజలు | 53 | 3,290 | 4 | 388 | 1.7 | 1.5 |
| | డి. నువ్వులు | 672 | 6,460 | 57 | 592 | 10.4 | 9.6 |
| | ఇ. ఇతర నూనెగింజలు | 171 | 5,665 | 13 | 962 | 3.0 | 1.4 |
| బి. | ప్రత్తి* | 957 | 18,340 | 133 | 4,298 | 5.2 | 3.4 |
| సి. | పొగాకు | 316 | 860 | 106 | 248 | 36.7 | 42.7 |
| డి. | మరొకచోట చేర్చబడని ఆహారేతరమైన యితర పంటలు | 727 | 23169 | .... | .... | 3.1 | .... |

*ఒక్కొక్కటి 392 పౌనులుగల బేళ్లు వెయ్యి.

## ఆంధ్రరాష్ట్రంలో ముఖ్యమైన పంటలకు విత్తనాలుజల్లే కాలము, కోతలు జరిగే కాలం

| పంట | | విత్తనాలుజల్లే కాలము | కోతలు జరిగే కాలము |
|---|---|---|---|
| 1 | | 2 | 3 |
| బియ్యం | మొదటి పంట | జూన్-అక్టోబరు | డిసెంబరు-మార్చి |
| | రెండవ పంట | డిసెంబరు | ఏప్రిల్ |
| | మూడవ పంట | జనవరి-మార్చి | ఏప్రిల్-మే |
| జొన్న | ఖరీఫ్ | జూన్-జూలై | అక్టోబరు-నవంబరు |
| | రబ్బీ | ఏప్రిల్-మే | జనవరి-ఫిబ్రవరి |
| సజ్జ | నీటి పారుదల సౌకర్యం కలది | ఏప్రిల్ - జూలై | జూలై-అక్టోబరు |
| | నీటి పారుదల సౌకర్యం లేనిది | జూలై-అక్టోబరు | అక్టోబరు-ఫిబ్రవరి |
| మొక్కజొన్న | | జూలై-అక్టోబరు | సెప్టెంబరు-ఫిబ్రవరి |
| కొఱ్ఱ, వరగు, సాములు | | జూన్ | సెప్టెంబరు |
| ఉలవలు | | సెప్టెంబరు | డిసెంబరు |
| పెసలు, మినుములు | | జూన్-డిసెంబరు | అక్టోబరు-మార్చి |
| సెనగలు | | నవంబరు | మార్చి |

| | | | |
|---|---|---|---|
| కందులు | | జూన్ | జనవరి |
| చెరకు | | జనవరి-మే | నవంబరు-ఏప్రిల్ |
| ఉల్లి పాయలు | | ఆగస్టు-జనవరి | నవంబరు-ఏప్రిల్ |
| మిర్చి | | సెప్టెంబరు | ఏప్రిల్ |
| వేరుసెనగ | నీటి పారుదల సౌకర్యం కలది | ఫిబ్రవరి-మార్చి | మే-జూలై |
| | నీటి పారుదల సౌకర్యం లేనిది | ఏప్రిల్-ఆగస్టు | ఆగస్టు-జనవరి |
| నువ్వులు | | మే-జనవరి | ఆగస్టు-ఏప్రిల్ |
| ఆముదాలు | | జూన్-జూలై | నవంబరు-ఫిబ్రవరి |
| ప్రత్తి | నీటి పారుదల సౌకర్యం కలది | మే-జూలై | జనవరి-ఆగస్టు |
| | నీటి పారుదల సౌకర్యం లేనిది | సెప్టెంబరు-నవంబరు | జనవరి-ఆగస్టు |
| బొంబాయి జనుం (గోగు) | | మే | ఆగస్టు |
| పొగాకు | | అక్టోబరు-డిసెంబరు | జనవరి-మార్చి |

## తెలంగాణా ప్రాంతంలో పంటల కాలము

| వరుస సంఖ్య | పంట | విత్తనాలు జల్లే కాలము | కోతలు జరిగే కాలము |
|---|---|---|---|
| | 1 | 2 | 3 |
| 1. | బియ్యం (ఆబీ) | జూన్-జూలై | నవంబరు |
| 2. | బియ్యం (తాబీ) | నవంబరు-జనవరి | మార్చి-ఏప్రిల్ |
| 3. | గోధుమ | అక్టోబరు | ఫిబ్రవరి-మార్చి |
| 4. | జొన్న (ఖరీఫ్) | జూన్-జూలై | నవంబరు-డిసెంబర్ |
| 5. | జొన్న (రబీ) | అక్టోబరు | మార్చి-ఏప్రిల్ |
| 6. | సజ్జ | జూన్-జూలై | అక్టోబరు |
| 7. | మొక్క-జొన్న | జూన్ | అక్టోబరు |
| 8. | రాగులు | జూలై | నవంబరు |
| 9. | సెనగలు | సెప్టెంబరు-అక్టోబర్ | జనవరి-ఫిబ్రవరి |
| 10. | కంది | జూన్ | ఫిబ్రవరి-మార్చి |
| 11. | పెసలు | జూన్ | సెప్టెంబరు |
| 12. | ఉలవ | జూన్-జూలై | అక్టోబరు |
| 13. | మినుములు | జూన్ | సెప్టెంబరు |
| 14. | వేరుసెనగ | జూన్-జూలై | అక్టోబరు-నవంబర్ |
| 15. | ఆముదాలు | జూన్-జూలై | ఫిబ్రవరి-ఏప్రిల్ |
| 16. | ఎల్లగిసె గింజలు | అక్టోబరు | జనవరి-ఫిబ్రవరి |
| 17. | నువ్వులు | జూన్-జూలై | అక్టోబరు |
| 18. | చెరకు (అడ్సాలి) | జనవరి | డిసెంబరు-జనవరి |
| 19. | ప్రత్తి (ఖరీఫ్) | జూన్-జూలై | నవంబరు-జనవరి |
| 20. | ప్రత్తి (రబీ) | ఆగస్టు-సెప్టెంబరు | మార్చి-ఏప్రిల్ |

# ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయక పరిశోధక కేంద్రాలు

| పరిశోధక కేంద్రం పేరు | పరిశోధింపబడిన పంటలు |
|---|---|
| 1. వ్యవసాయ పరిశోధక కేంద్రం, శ్రీకాకుళం | వరి, మెట్టధాన్యాలు, బొంబాయి జనుము (గోగు) |
| 2. అరకులోయక్షేత్రం, అరకు | వరి, మెట్టధాన్యాలు, పళ్లు, కూరగాయలు |
| 3. ప్రభుత్వ మెట్టధాన్యాల క్షేత్రం, విజయనగరం | జొన్న, చోడి, సజ్జ, నువ్వులు |
| 4. చెరకు పరిశోధక కేంద్రం, అనకాపల్లి | చెరకు, వరి, చోడి, పళ్లు |
| 5. పరిశోధన - ప్రదర్శన క్షేత్రం, రంపచోడవరం | ఏజన్సీ ప్రాంతాలకు అనువైన పళ్లచెట్లు |
| 6. ప్రభుత్వ మెట్టధాన్యాల క్షేత్రం, పెద్దాపురం | మెట్టధాన్యాలు, పప్పుదినుసుల పని |
| 7. వ్యవసాయ పరిశోధక కేంద్రం, సామర్లకోట | వరి |
| 8. లోతునీటి బియ్యం పరిశోధకకేంద్రం, పుళ్ల | వరి |
| 9. వ్యవసాయ పరిశోధకకేంద్రం, మారుటేరు | వరి |
| 10. కొబ్బరి పరిశోధక కేంద్రం, అంబాజీపేట | కొబ్బరికాయలు |
| 11. చవుడుభూముల బియ్యం పరిశోధకకేంద్రం, మచిలీపట్నం | వరి |
| 12. వ్యవసాయ పరిశోధక కేంద్రం, లామ్ (గుంటూరు) | జొన్న, పొగాకు, మిర్చి, ప్రత్తి, సెనగ, ధనియాలు |
| 13. పసుపు పరిశోధకకేంద్రం, పెద్దపాలెం | పసుపు |
| 14. ప్రత్తికేంద్రం, నరసారావుపేట | ప్రత్తి |
| 15. కాలేజీఫారమ్, బాపట్ల | వరి, చోడి, చెరకు, అరటి, పప్పుదినుసులు, పళ్లు, కాయగూరలు |
| 16. ప్రభుత్వ మెట్టధాన్యాల క్షేత్రం | పైరు, జొన్న, వరిగ |
| 17. బియ్యం పరిశోధకకేంద్రం, బుచ్చిరెడ్డిపాలెం | వరి |
| 18. ప్రదర్శన - పరిశోధనకేంద్రం, యెమ్మిగనూరు | 1955 జూన్‌లోనే ఆరంభించబడింది |
| 19. జోనల్ న్యూక్లియస్ సీడ్‌ఫారమ్, ఆదోని | నూనెగింజలు (వేరుసెనగ, ఆముదాలు) |
| 20. వ్యవసాయ పరిశోధక కేంద్రం, నంద్యాల | ప్రత్తి, జొన్న, కొర్ర |
| 21. నమూనా తోటలు - నారుమొక్కల క్షేత్రము, గిద్దలూరు | మామిడి, నిమ్మ, సపోటా, జామ, జీడిమామిడి, ద్రాక్ష |
| 22. ప్రాంతీయ నూనెగింజల పరిశోధనకేంద్రం, అనంతపురం | వేరుసెనగ, ఆముదాలు |
| 23. ఫల పరిశోధక కేంద్రం, కోడూరు | మామిడి, నిమ్మ, సపోటా, జామ, జీడిమామిడి, పనస, దానిమ్మ |
| 24. పానగల్ ప్రదర్శనక్షేత్రం, కాళహస్తి | వరి, వేరుసెనగ, అరటి, కూరగాయలు |
| 25. జోనల్ న్యూక్లియస్ సీడ్‌ఫారమ్, వాయల్పాడు | నూనెగింజలు (వేరుసెనగ, ఆముదాలు) |
| 26. వ్యవసాయ పరిశోధక కేంద్రం, ఆదిలాబాదు | ప్రత్తి |
| 27. వ్యవసాయ పరిశోధకకేంద్రం, నిజామాబాదు | చెరకు, చీడపురుగులు |
| 28. వ్యవసాయ పరిశోధకకేంద్రం, రుద్రూరు, నిజామాబాదు | చెరకు, పళ్లు, బియ్యం |
| 29. వ్యవసాయ పరిశోధక కేంద్రం, సంగారెడ్డి, మెదక్ | పళ్లు, సీతాఫలం, సపోటా, మామిడి, జామ, దానిమ్మ, బియ్యం, జొన్న, నూనెగింజలు, కాయగూరలు |

| | |
|---|---|
| 30. వ్యవసాయక్షేత్రం, అంబర్ పేట | వరి, మొక్కజొన్న, కూరగాయలు |
| 31. వ్యవసాయ పరిశోధక కేంద్రం, కరీంనగరం | మొక్కజొన్న |
| 32. వ్యవసాయ పరిశోధకకేంద్రం, రాజేంద్రనగర్, హైదరాబాదు | నేల, తత్సంబంధమైన సమస్యలు, వుద్యానవన సమస్యలు, చీడపురుగులు, పంటల తెగుళ్లు, పంట అభివృద్ధి, బియ్యం, పప్పుదినుసులు, నూనెగింజలు, మెట్టధాన్యాలు, పశుగ్రాసం పైర్లు |
| 33. వ్యవసాయ పరిశోధక కేంద్రం, దిండి, నల్గొండ | బియ్యం, ఆముదాలు |
| 34. వ్యవసాయ పరిశోధక కేంద్రం, వరంగల్లు | బియ్యం, పప్పుదినుసులు, పళ్లు |
| 35. వ్యవసాయ పరిశోధక కేంద్రం, మధిర, ఖమ్మం | పొగాకు |

## శీతోష్ణస్థితి, వర్షపాతము

ఆంధ్రప్రదేశ్‌లో సంవత్సరానికి సగటున యించుమించు 35 అం. వర్షం కురుస్తుంది. రాష్ట్రంలో చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లో తప్ప మిగిలిన జిల్లాల్లో నైరృతి ఋతుపవనాల వల్ల యెక్కువ వర్షం కురుస్తుంది. చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లో వర్షం ఈశాన్య ఋతుపవనాల వల్ల కురుస్తుంది. బంగాళాఖాతంలో యేర్పడిన వాయుగుండాల వల్ల యీ రాష్ట్రానికి తరుచు తుపానులు, గాలివానలు వస్తూవుంటాయి. విపరీతమైన అధికవర్షాల వల్ల వరదలు వచ్చి నదులకు, చెరువులకు గండ్లుపడతాయి. ఈ అధికవర్షాల వల్ల పంటలు మునిగిపోవడం లేదా పూర్తిగా కొట్టుకొనిపోవడం కూడా తరుచు జరుగుతూవుంటుంది. ఇందువల్ల రైతులకు బాగా నష్టం కలుగుతుంది. రాయలసీమ జిల్లాల్లో తగినంత వర్షం సకాలంలో కురవనందున పంటలు చెడిపోతూవుంటాయి. ఈ అతివృష్టి అనావృష్టుల వల్ల సాధారణంగా కరువులు వస్తూవుంటాయి. రాయలసీమ జిల్లాలను కరువు కాటకాల నుంచి కాపాడ్డానికై తుంగభద్ర దిగువ కాలువ నిర్మాణం పూర్తిచేయబడింది. ఎగువ కాలువ నిర్మాణం మంజూరు చేయబడింది.

శీతోష్ణస్థితిని బట్టి యీ రాష్ట్రాన్ని నాలుగు ముఖ్య మండలాలుగా విభజించవచ్చును. 1. డెల్టామండలం, 2. కోస్తా మైదానాలు, 3. తూర్పుకనుమలు, 4. పీఠభూమి. డెల్టా మండలంలో ప్రధానంగా గోదావరి, కృష్ణా డెల్టాలున్నాయి. ఈ మండలంలో వర్షపాతం 35-45 అం.మధ్య వుంటుంది. సాలుసరి అల్పతమ వుష్ణోగ్రత గోదావరిడెల్టాలో 80డిగ్రీలు ఫారన్‌హీటు నుంచి కృష్ణా డెల్టాలో 85 డిగ్రీల వరకూ వుంటుంది. సాధారణంగా మేనెలలో వుష్ణోగ్రత అత్యధికంగా వుంటుంది. కోస్తామైదానాలు ప్రకృతిస్వభావంలోను, వర్షపాతంలోను ఒకేవిధంగా వుండవు. వర్షపాతం వుత్తరాన (అనగా శ్రీకాకుళం జిల్లాలో) 42-45 అం. వుంటుంది. నైరృతి మూల (మద్రాసురాష్ట్ర సరిహద్దువైపు) 30-35 అం. వుంటుంది. కోస్తాలో ఈశాన్యాన వర్షపాతం క్రమంగా (కోస్తా సమీపంలో 35 అం. నుంచి కనుమల సమీపంలో 45అం. వరకూ) హెచ్చుతుంది. ఆగ్నేయాన అది క్రమంగా (కోస్తా సమీపంలో 45 అం. నుంచి కనుమల సమీపంలో 30 అం. వరకూ) తగ్గుతుంది. తూర్పు కనుమల మండలం కృష్ణా, గోదావరి మెట్టభూములద్వారా రెండు స్వతంత్రమైన విభాగాలుగా విభజింపబడుతుంది. ఈ ప్రాంతంలో వేసవి యెండలు భీకరంగా వుండవు. శీతాకాలం చల్లగావుంటుంది. మంచు, పొగమంచు కురుస్తూవుంటాయి. తెలంగాణా శీతోష్ణస్థితి పూర్తిగా కాకపోయినా సంవత్సరంలో చాల కాలం బాగుంటుంది. ఈ ప్రాంతంలో కొంతభాగం కొండ ప్రదేశం. ఇక్కడ పొడియెడారులు లేవు. అందుచేత యిక్కడ వేడిగాలులు వుండవు. తెలంగాణాలో స్పష్టమైన మూడు ఋతువు లున్నాయి. 1. జూన్ ఆరంభం నుంచి సెప్టెంబరు ఆఖరివరకు వర్షాకాలం, 2. అక్టోబరు మొదలు జనవరి ఆఖరివరకు చలికాలం, 3. ఫిబ్రవరి మొదలు మే ఆఖరువరకూ వేసవికాలం.

పీఠభూమి మండలంలో వర్షపాతం 20 అం. నుంచి యించుమించు 40అం. వరకూ వుంటుంది. ఈ మండలంలో వేసవియెండలు భీకరంగా వుంటాయి. శీతాకాలం వెచ్చగా పొడిగా వుంటుంది. ఉష్ణోగ్రత హెచ్చుతగ్గులలో బాగా వ్యత్యాసం వుంటుంది. ఈ లక్షణాలవల్ల రాష్ట్రంలో మిగిలిన ప్రాంతాల కంటె యిది భిన్నంగా కనపడుతుంది.

## వ్యవసాయ ఋతువులు

ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ ఋతువులు, పంటల విధానాలు నిర్ణయంకావడంలో వర్షాలు ప్రధానపాత్ర వహిస్తాయి. సకాలంలో అన్ని ప్రాంతాలలోను సమంగా వర్షాలు కురిస్తే వ్యవసాయం పనులు చక్కగా సాగుతాయి.

ఆంధ్రప్రదేశ్‌లో విత్తనాలు జల్లే ముఖ్యమైన ఋతువులు యివి :

| పేరు | కాలము | ప్రదేశము |
|---|---|---|
| 1. పునాస | ఏప్రిల్ - జూన్ | సర్కారు జిల్లాలు |
| 2. పైరు | అక్టోబరు - నవంబరు | సర్కారు జిల్లాలు |
| 3. ముంగారి | మే - జూలై | రాయలసీమ |
| 4. హింగారి | సెప్టెంబరు - అక్టోబరు | రాయలసీమ |
| 5. ఖరీఫ్ | జూన్ - జూలై | తెలంగాణా |
| 6. రబీ | సెప్టెంబరు - అక్టోబరు | తెలంగాణా |

(సశేషం)



---

## విశ్వవిద్యాలయాలు [ 20 వ పేజీ తరువాయి ]

ఇవన్నీ మన విశ్వవిద్యాలయాలపై వస్తూ వున్న విమర్శలు. వీటిలో కొంత నిజంకూడా వుంది. అయినప్పటికీ ఒక విషయం మాత్రం మనం ఒప్పుకొని తీరాలి. ఈ విశ్వవిద్యాలయాలవల్ల కొంత మేలు జరిగినమాట నిజం. ఇవి చేసినకృషి వృధాపోదు. వీటికి కొన్ని ఉన్నతాదర్శాలు, లక్ష్యాలూ వున్నవి. కనుకసర్వ స్వతంత్ర ప్రజాస్వామ్య భారతదేశంలో ఈ విశ్వవిద్యాలయాలు అర్హమయిన స్థానాన్ని పొంది జాతీయ జీవితంలో తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తా యనడంలో ఏమాత్రం సందేహం లేదు.

*( ఆలిండియా రేడియో సౌజన్యంతో )*

---

## అడవులు [ 24 వ పేజీ తరువాయి ]

యంపై వ్యయంయొక్క శతి తెలంగాణా ప్రాంతములో 17.5శతి, ఆంధ్రప్రాంతంలో 59.6శతి అన్నమాట. ఆంధ్రప్రదేశ్‌కు మొత్తం మిగులు ఆదాయం (అంటే ఆదాయంలోనుంచి ఖర్చును తీసివేయగా) రూ 1,54,80,581 లు.

అడవులవల్ల ఆదాయం వచ్చే వనరుల నన్నిటినీ సక్రమంగా ఉపయోగించుకొన్నట్లయితే మన రాష్ట్రాదాయం బాగా పెరగగలదు.

మన రాష్ట్రం సహజ సంపదలు ఇంకా అభివృద్ధి దశలో వున్నవి. ఈ సంపదలను వృద్ధిచేయడానికి రెండవ పంచవర్ష ప్రణాళిక తోడ్పడుతుంది. అభివృద్ధితోపాటు ఆదాయంకూడా కలుగుతుంది. బీడు భూములను బాగుపరచడం, నగ్నమైపోయిన కొండలపై గుట్టలపై చెట్లు పెంచడం, ఇసుక తిన్నెలు గాలికి ఎగిరిపోకుండా నిరోధించడం, చొరరాకుండా అయిపోయిన ఏజన్సీప్రాంతపు అడవులలోకి మార్గాలు వేయడం, ఏజన్సీ ప్రజల స్థితిగతులను బాగు పర్చడం, పోడు వ్యవసాయంచేసి విడిచిపెట్టిన ప్రాంతాలను బాగుచేయడం — ఈ చర్యలన్నింటివల్ల రాష్ట్రాదాయం హెచ్చి, ప్రజలకు మేలు చేకూరగలదని ఆశించవచ్చు.

* * *



> "మానవజీవితం తెగని ప్రవాహం వంటిది. అలాగే ఒక జాతి జీవితగమనాన్ని క్రమబద్ధంచేసి సర్వతోముఖమైన అభ్యుదయం కలుగజేసే పథకరచన. అభివృద్ధి కార్యక్రమాలు కూడా నిరంతరమైనవి; నిత్యనూతనమైనవి. కనుక శ్రేయోభివృద్ధుల సాధననిమిత్తమై మనం తలపెట్టిన ఈ ప్రయాణంలో మజిలీలు అంటూలేవు"
>
> —జవహరలాలు నెహ్రూ

# అభివృద్ధి బ్లాకులలో జరుగుతున్న కృషి



విశాఖపట్నంజిల్లా నర్సీ పట్నం తాలూకాలోని గోలుగొండ బ్లాకుకు సంబంధించిన ఒక గ్రామంలో వయోజన విద్యాకేంద్రం



*విశాఖపట్నం జిల్లా నర్సీపట్నం తాలూకాలోని గోలుగొండ బ్లాకుక్రిందగల ఒక గ్రామంలో వృత్తిపనుల శిక్షణ కేంద్రం.*

1957 మార్చి నెలాఖరువరకు ఆంధ్ర ప్రాంతం లోని సామాజికాభివృద్ధి బ్లాకులలో జరిగిన కృషిని ప్రాతిపదికగా తీసుకొని ఆయా బ్లాకులను ఈక్రింది ప్రాధాన్య క్రమప్రకారం నిర్ధారించడ మైనది :

1. రాజానగరం
2. వాయల్పాడు
3. భీమడోలు
4. వెంకటాచలం
5. నూజివీడు
6. మడకశిర
7. గిద్దలూరు
8. జమ్మలమడుగు
9. కొడిగెనహళ్ళి
10. కోట అవరుట్ల
11. ఆలూరు
12. ఇచ్ఛాపురం
13. పెందుర్తి
14. చింతలపూడి
15. పల్లిపట్టు
16. పొదలకూరు
17. నగరి
18. ఎర్రగొండపాలెం

19. మద్దిపాడు
20. కర్నూలు
21. ఆముదాల వలస
22. అమ్మనబ్రోలు
23. గార
24. సబ్బవరం
25. నక్కపల్లి
26. కోరుకొండ
27. కొయ్యలగూడెం

ప్రజలు చేసిన సహాయం, ప్రభుత్వంపెట్టిన ఖర్చు

బ్లాకులన్నింటిలో 1957 మార్చినెలలో ప్రజలు చేసిన సహాయం రూ. 8,68,248 లు. ప్రభుత్వంపెట్టిన ఖర్చు రూ. 14,87,147 లు.

ఈనెలలోనే నూజివీడు బ్లాకులోని అగిరిపల్లి గ్రామంలోను, సబ్బవరం బ్లాకులోని పరసవాడ గ్రామంలోను, కోటఅవరుట్ల బ్లాకులోని తుఖ్ఖారు గ్రామంలోను. వాయల్పాడు బ్లాకులోని దేవులపల్లి గ్రామంలోను గ్రామనాయకుల శిక్షణ శిబిరాలు నిర్వహింపబడ్డవి.

విశాఖపట్నం జిల్లాలోని మినుములూరు గ్రామంలో 1957 మే 28 వ తేదీనుంచి నాలుగురోజులపాటు గ్రామనాయకుల శిక్షణ శిబిరం నిర్వహింపబడింది. ఈశిబిరం హుకుంపేట బహుళార్థసాధక ప్రాజెక్టు అధ్వర్యాన ఏర్పాటు చేయబడింది. ఇందులో 28 మంది పురుషులు, 11 మంది స్త్రీలు శిక్షణ పొందారు. వారిలో సహకార సంఘాల ప్రతినిధులేగాక వృత్తి పనివారు ఉపాధ్యాయులు, హరిజనులు పెత్తందార్ల ప్రతినిధులు కూడా వున్నారు.

బారిసింగిముట్టాదారు, విశాఖపట్నంజిల్లా ప్లానింగు కమిటీ సభ్యులూ అయిన శ్రీ కె. మల్లంనాయుడు ఈ శిబిరానికి ప్రారంభోత్సవం చేశారు. ఇందులో వ్యవసాయం, పశుపోషణ, గ్రామీణ జీవితానికి సంబంధించిన ఇతర అంశముల విషయంలో ఆధునిక విధానాలు బోధింపబడ్డవి. శ్రమదానం చేయబడింది. ప్రతిరోజూ ఉదయంపూట అధికార్లు ఉపన్యాసాలిచ్చి అనేక విషయాలు తెలియ జేశారు. మధ్యాహ్నం చర్చలూ, ప్రదర్శనలు జరిగేవి. సాయంత్రం వేళల ఆటలూ, వైజ్ఞానిక ప్రదర్శనలూ వుండేవి.

ఈ శిబిరంవారు ప్రోత్సహించిన శ్రమదానంవల్ల గ్రామం మధ్య ఒకపార్కు ఏర్పడింది. పరిశుభ్రమైన మంచినీరు లభించే వసరు ఏర్పడింది. గ్రామవీధులు బాగుపడ్డవి.



*నల్లగొండజిల్లా ఏండ్లపల్లి గ్రామంలో 25-6-1957 తేదీన ప్లానింగు మంత్రి శ్రీ వి. బి. రాజు జాతీయ విస్తరణ సేవా కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. చిత్రంలో గ్రామస్తులు మంత్రిగారిని ప్రారంభోత్సవ స్థలానికి ఊరేగింపుతో తీసుకపోతున్నారు.*

# వార్తలు - విశేషాలు

## ఓటర్ల జాబితాల సవరణ

1957 లో జరుపవలసిన ఓటర్ల జాబితాల పునర్విమర్శను ఇప్పుడు ప్రారంభించమని ఇండియా ఎన్నికల కమీషన్ ఆదేశించింది. ఓటర్ల జాబితాలు 1956 సంవత్సరపు పార్లమెంటరీ, అసెంబ్లీ నియోజక వర్గాల ఉత్తర్వులో డిలిమిటేషన్ కమీషన్ నిర్ణయించిన కొత్త నియోజక వర్గాల ప్రాతిపదికపై తయారుచేయబడతాయి. ఈ పునర్విమర్శ సందర్భంలో అర్హతతేదీ 1-3-1957. అంటే 1-3-1957 నాటికి 21 సంవత్సరాలకు తక్కువకాని వయస్సు కలిగివుండి, ఒకనియోజక వర్గంలో సాధారణంగా నివసిస్తూ ఉండి, 1950 సంవత్సరపు ప్రజాప్రాతినిధ్యం చట్టంలోని 16 వ సెక్షన్‌క్రింద ఓటర్ల జాబితాలో రిజిస్టరు కావడానికి అనర్హతలేని ప్రతివ్యక్తికూడా ఆ నియోజక వర్గంలో ఇప్పుడు పునర్విమర్శింపబడే ఓటర్లజాబితాలో పేరును రిజిస్టరు చేయించుకోవచ్చును. ఓటరుగా చేరడానికి ఒక నియోజక వర్గంలో 180 రోజులు నివసించి వుండాలని పూర్వం ఉన్న నిబంధన ఇప్పుడు తొలగించబడింది. 1957 వార్షిక పునర్విమర్శ సందర్భంలో ఈ విషయము పరిశీలించబడదు.

ఓటర్ల జాబితాలు, నిర్ణీతమయిన కొన్ని ప్రాంతాలలో ప్రతి ఇంటికి వెళ్ళి వివరాలు సేకరించినమీదట సవరించ బడతాయి. మిగిలిన ప్రాంతాలలో మామూలుగా సవరించబడతాయి. రాజధాని కర్నూలునుంచి హైదరాబాదుకు వచ్చినందున కర్నూలు అసెంబ్లీ నియోజకవర్గం మునిసిపల్ ప్రాంతంలోను, హైదరాబాదు, సికింద్రాబాదు నగరాలలోను యీ సందర్భంలో ఇంటింటికి వెళ్ళి వివరాలు సేకరించబడతాయి. ఈ పని 1-6-1957 నుంచి ఆరంభమవుతుంది. జాబితాలు తుదిసారిగా 31-10-1957 నాటికి ప్రచురించబడతాయి. హైదరాబాదు, సికింద్రాబాదు నగరాల అసెంబ్లీ నియోజకవర్గాల విషయంలో యీ వివరాల సేకరణ కార్యక్రమం 17-6-1957 న ఆరంభమవుతుంది. ఓటర్ల జాబితాలు తుదిసారిగా 5-12-57 నాటికి ప్రచురించ బడతాయి.

మామూలు పునర్విమర్శ జరిగే ప్రాంతాలలో ప్రస్తుతపు ఓటర్ల జాబితాలకు సవరణల జాబితా తయారుచేసే కార్యక్రమం 10-5-57 నుంచే ఆరంభమయింది. ఓటర్ల జాబితాలు ప్రస్తుతపు కార్యక్రమం ప్రకారం తుదిసారిగా 20-9-57 నాటికి ప్రచురింపబడతాయి.

## సాంకేతిక విద్యాశాఖ

"సాంకేతిక విద్య, శిక్షణశాఖ" నొకదానిని తక్షణం ఏర్పాటు చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. ఇంతవరకూ విద్యాశాఖ జాయంట్ డైరెక్టర్ (సాంకేతికవిద్య) క్రింద పనిచేస్తున్న సిబ్బందితోనూ, విద్యాశాఖ డైరెక్టరు కార్యాలయంలో ఇంజనీరింగు కాలేజీల వ్యవహారాలనూ అనంతపురం, కాకినాడల పాలీటెక్నిక్కుల వ్యవహారాలను చూస్తూవున్న సిబ్బందితోనూ ఈకొత్త శాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఇకనుంచి అన్ని ఇంజనీరింగు కళాశాలలు, పాలీటెక్నికులు, పారిశ్రామిక పాఠశాలలు, శిక్షణ కేంద్రాలు, సెంట్రల్ వర్కుషాపులు, మైనింగ్ ఇన్‌స్టిట్యూట్లు, లలితకళల కళాశాల, వాణిజ్యకళాశాల, బాలికలవృత్తి విద్యాసంస్థలు, ప్రభుత్వ సంగీత నృత్య పాఠశాల, తదితర సాంకేతిక విద్యాసంస్థలు ఈ కొత్త శాఖక్రింద వుంటాయి.

ఇప్పుడున్నట్టి విద్యాశాఖ జాయింట్ డైరెక్టర్ (సాంకేతిక విద్య) పదవిని "సాంకేతిక విద్య, శిక్షణ శాఖ డైరెక్టర్" అని తిరిగి నామకరణం చేయవలెనని కూడాప్రభుత్వం ఆదేశించింది.



# * డైరీ *

## జూన్ 1957

1. గనులు, ఖనిజముల విషయమై సలహాలిచ్చేటందుకై రాష్ట్ర ప్రభుత్వం 11 మంది సభ్యులతో ఒక సంఘాన్ని నియమించింది. దీనికి ముఖ్యమంత్రి అధ్యక్షుడుగా వ్యవహరిస్తారు.

హైదరాబాదు మహిళా సహాయక సంఘంవారు జరిపిన సాంఘిక—ఆర్థిక పరిశీలననుబట్టి మాజీ సైనికుల కుటుంబాలకు చెందిన స్త్రీలు ఎక్కడ పని దొరికితే అక్కడికెళ్ళి పనిచేయడానికి సంసిద్ధులై వున్నారని తెలుస్తున్నది. ఈ పరిశీలన తరువాతనే హైదరాబాదు నగరంలోని మూడుప్రాంతాలలో మూడు సహకార అగ్గిపెట్టల ఫ్యాక్టరీలు స్థాపించబడినవి.

2. వంశధారనదిపై రిజర్వాయర్ నిర్మాణానికిగాను ఒరిస్సా రాష్ట్రంలో గుడారివద్ద స్థలాన్ని పరిశోధించడానికయ్యే యావత్తు ఖర్చును రాష్ట్ర ప్రభుత్వమే భరించ వలసి వుంటుందని తెలుస్తున్నది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ పరిశోధనకు పూనుకోవడానికి అనుమతినిచ్చేందుకు ఒరిస్సా ప్రభుత్వం పైషరతును విధించింది.

కర్నూలు-కడప కాల్వ అభివృద్ధికై తలపెట్టబడిన పథకం నూటికి 90 వంతులు పూర్తి అయింది. ఈ పథకానికయ్యే వ్యయం రూ. 3 కోట్ల 90 లక్షలు.

3. 15 మంది సభ్యులతో కూడిన ఆంధ్ర రాష్ట్ర గ్రామోద్యోగుల సంఘం ప్రతినిధి వర్గానికి రెవిన్యూ మంత్రి దర్శనమిచ్చి అధిక వేతనాలు, మొదలగు వారికోర్కెల విషయమై చర్చలు జరిపారు. ఈ ప్రతినిధివర్గానికి గ్రామోద్యోగుల సంఘం అధ్యక్షుడు నాయకత్వ వహించారు.

4. 1957-58సంవత్సరంలో హైద్రాబాదునగరంలో మురికిపేటలను బాగుపరచడానికీ, దుమ్ములేకుండా రోడ్లపై కప్పు వేయడానికీ, హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషనుకు ప్రభుత్వం రూ. 10 లక్షల 29 వేల గ్రాంటు మంజూరు చేసింది.

5. గ్రామ పాఠశాలల ఉపాధ్యాయులకు అభివృద్ధికి సంబంధించిన వివిధ అంశములపై స్వల్పకాలిక శిక్షణ ఇచ్చేటందుకై రాష్ట్రంలో ఎనిమిదిచోట్ల శిక్షణ శిబిరాలను నిర్వహించవలెనని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ శిబిరాల నిర్వహణకయ్యే మొత్తం ఖర్చును కేంద్రం భరిస్తుంది.

6. యూనియన్ ప్రభుత్వ ఆహారశాఖామంత్రి హైదరాబాదులో ఒక సందర్భంలో ప్రసంగిస్తూ బియ్యం ధరలు పెరిగే విధంగా స్పెక్యులేషన్ ధోరణులు ప్రబలినట్లయితే వాటిని అణచివేయడానికి ప్రభుత్వం కృతనిశ్చయమై వుందని తెలిపారు. బియ్యం ధరలను తగ్గుముఖంలో పెట్టడానికై అవసరమైతే కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు సబ్సిడీ లివ్వడానికి కూడా సిద్ధంగా వున్నట్లు తెలియ జేశారు.

1957-58 సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అంచెనాలో చేసిన తగ్గింపును ప్లానింగ్ కమీషన్ మళ్ళీ భర్తీ చేసింది. ఇప్పుడు ఆంధ్ర ఆంధ్రప్రదేశ్ ప్రణాళిక మొదట ప్రతిపాదింపబడినట్లుగా రూ. 34 కోట్ల 10 లక్షలపై స్థిరపరచ బడిందని ముఖ్యమంత్రి వెల్లడించారు.

7. హైద్రాబాదు సికింద్రాబాదు కార్పొరేషనులలో పనిచేసే దాదాపు 5000 మంది పైచిలుకు ఉద్యోగులకు 1957 ఏప్రిల్ 1వ తేదీనుంచి రూ. 6 ల అదనపు కరువు బత్తెం లభిస్తుంది. రూ. 100 లు లేక అంతకంటె తక్కువ వేతనం గల నాన్‌గజిటెడ్ ఉద్యోగుల కరువు బత్తెమును హెచ్చించుతూ, అ హెచ్చింపును కార్పోరేషను ఉద్యోగులకు కూడా వర్తింపజేయవలెనని రాష్ట్ర ప్రభుత్వం గైకొన్న నిర్ణయం ఫలితమే ఇది.

8. ఆంధ్రప్రదేశ్-మద్రాసుల సరిహద్దుల నిర్ణయం విషయమై చర్చలు ఆరంభమయ్యాయి. ఆంధ్ర ప్రతినిధులు శ్రీ హెచ్. వి. పటాస్కర్‌ను కలిశారు.

1957-58 అద్దె-కొనుగోలు పద్ధతి క్రింద రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంలో ట్రాక్టర్లనుకొని సరఫరా చేయడానికై ప్రభుత్వం రూ. 13.50 లక్షలు మంజూరు చేసింది. ఇందునిమిత్తమై యూనియన్ ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి కొంత అప్పు మంజూరుచేసింది.

9. లైఫ్ ఇన్సూరెన్సు కార్పొరేషన్ ఆఫ్ ఇండియా వారి జనతా పాలిసీల పథకానికి రాష్ట్ర రెవిన్యూ మంత్రి ప్రారంభోత్సవంచేశారు. ఈ రోజే ఈపథకం తూర్పు గోదావరి జిల్లాలోని కాకినాడలో పైలట్ ప్రాజెక్టుగా ఆరంభింపబడింది.

హైదరాబాదు సికింద్రాబాదు నగరాలలో ఇన్‌ఫ్లూయెంజా వ్యాధిని అరికట్టే నిమిత్తమై ప్రభుత్వం మ్యాటినీ సినిమా ప్రదర్శనాలను నిషేధించింది. అలాగే పాఠశాలలు తెరిచే తేదీని కూడా వాయిదా వేసింది.

10. వ్యయకర్తనం నిమిత్తమై ప్రధాన మంత్రి దేశ వ్యాప్తమైన ఉద్యమాన్ని ప్రారంభించారు. చిన్న చిన్న విషయాలలో కూడా ఖర్చును తగ్గించవలెనని నిశ్చయింపబడింది.

11. ఆంధ్రప్రదేశ్‌కు శ్రీ భీమసేన్ సాచార్‌ను గవర్నర్‌గా నియమించినట్లుగా ప్రకటన వెలువడింది.

అడవుల మేనేజిమెంటు విషయమై ప్రభుత్వానికి సలహాలిచ్చేందుకుగాను 21 మంది సభ్యులతో కూడిన రాష్ట్రబోర్డు నియమింప బడింది.

12. చిన్న పరిశ్రమల అభివృద్ధికి తలపెట్టబడిన పథకాలను అమలు జరపడానికై రాష్ట్రప్రభుత్వం గ్రాంట్లు, అప్పులు మంజూరు చేసింది. శ్రీకాకుళం, ఏలూరు, నెల్లూరు, గుంటూరు, కర్నూలు, కడపలలో వడ్రంగంపని శిక్షణ - ఉత్పత్తి కేంద్రాలు నెలకొల్ప బడినవి. మొత్తం రూ. 8 లక్షల ఆర్థిక సహాయం మంజూరు చేయబడింది.

13. ఇన్‌ఫ్లూయెంజా వ్యాధి కారణంగా దక్షిణ రైల్వే అధికారులు విజయవాడకు యాత్రికులను గొని పొయ్యే ప్రత్యేక రైళ్ళను రద్దుచేశారు.

1956 సంవత్సరపు హైదరాబాదు భూముల విభజన నిరోధక ఏకీకరణ చట్టము ననుసరించి ప్రభుత్వం నియమావళిని సిద్ధం చేసింది.

14. వస్త్రంపై ఆంధ్ర ప్రాంతపు అమ్మకపుపన్ను రేట్లు విధింపబడినందుకు తమ నిరసన తెలియజేయడానికై సికింద్రాబాదు వస్త్ర వ్యాపారులు జూన్ 15 వ తేదీనుంచి షాపులను నిరవధికంగా మూసివేయడానికి నిర్ణయించారు.

భూముల కేటాయింపు కొరకై రాజకీయ బాధితులు పెట్టుకొన్న దరఖాస్తు లన్నిటిపై 1957 జులై 15 తేదీ లోపుగా ఏదోచర్య తీసుకొని పరిష్కారం చేసివేయడానికై ప్రభుత్వం నిర్ణయించినట్లుగా రాష్ట్ర రెవిన్యూ మంత్రి తెలియ చేశారు.

15. విశాఖపట్నం డాల్ఫిన్స్‌నోస్‌పై నిర్మింపబడిన లైట్‌హౌజ్‌కు యూనియన్ ప్రభుత్వ రవాణా, తంతి తపాలాల మంత్రి ప్రారంభోత్సవం జరిపారు. ఈ లైట్‌హౌజ్ 7,000,000 కేండిల్ పవర్ గలది. దాదాపు 40 మైళ్లిమేరకుకాంతినిప్రసరింపచేస్తుంది. ప్రపంచంలోని శక్తివంతమయిన దీపగృహాలలో ఇదికూడాఒకటి.

ఆంధ్ర ప్రాంతంలో సామాజికాభివృద్ధి కార్యక్రమంక్రింద పనిచేస్తున్న అధికారుల కున్నటువంటి అధికారాలనే తెలంగాణా ప్రాంతంలో వారితో సమానులయిన ఉద్యోగులకుకూడా ఇవ్వవలెనని ప్రభుత్వం ఆదేశించింది. ఇలా చేయడంవల్ల ఉభయ ప్రాంతాలలోని అధికారులకు సమానమయిన అధికారాలుండడమే గాక తెలంగాణా ప్రాంతంలో అభివృద్ధి పనులు చురుగ్గా జరగడానికి వీలు కలుగుతుంది.

16. చేనేత సహకార సంఘాలకు ఆర్థిక సహాయం చేయడానికై ప్రత్యేకంగా ఒక ఆర్థిక సంస్థను నెలకొల్పడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

రెండవ పంచవర్ష ప్రణాళిక కాలంలో ఆంధ్ర ప్రాంతంలో హరిజన విద్యార్థులకు, అర్హులయిన ఇతర కులాలకు చెందిన విద్యార్థులకు అదనంగా 8,400 స్కాలర్‌షిపులు మంజూరు చేయడానికి ప్రభుత్వం తలపెట్టింది.

17. తుంగభద్ర హైలెవల్ కాల్వ నిర్మాణం సందర్భంలో ప్రాథమిక పనులను ఆరంభించడానికై ప్రభుత్వం రూ. 16.98 లక్షలు మంజూరుచేసింది.

18. సాధారణ అమ్మకపు పన్ను చట్టము ననుసరించి ప్రభుత్వం రాష్ట్రం మొత్తానికి ఒక అప్పెల్లేట్ ట్రిబ్యూనల్‌ను ఏర్పాటు చేసింది.

రాష్ట్రంలో ఇన్‌ఫ్లూయెంజా వ్యాపించకుండా నిరోధించడానికై ప్రభుత్వం తగుకట్టుబాట్లు చేయడానికి నిర్ణయించింది.

సామాజికాభివృద్ధి ప్రాజెక్టులలోను, జాతీయ వికాస కేంద్రాలలోను జరుగుతున్న కార్యకలాపాలను పరిశీలించి నివేదించడానికై ప్లానింగ్ కమీషన్‌చే నియమింపబడిన అయిదుగురు సభ్యులుగల పరిశీలకుల జట్టు ఆంధ్రప్రదేశ్‌లో నాలుగు రోజులపాటు పర్యటన జరుపడానికి వచ్చింది.

19. నాగార్జున సాగర్ ప్రాజెక్టు ప్రధాన కుడి కాల్వను 52 వ మైలునుంచి 135 మైలు వరకు వివరంగా పరిశోధించేపని మొదలైంది.

20. 11 మంది సభ్యులతో ప్రభుత్వం రాష్ట్ర కుటుంబ నియంత్రణ బోర్డును ఏర్పాటు చేసింది. కొత్త చికిత్సాలయాలను తెరువడానికీ, పాతవాటిని కొనసాగించడానికీ. డాక్టర్లకూ యితర కార్యకర్తలకూ శిక్షణ ఇవ్వడానికీ, విద్యకూ పరిశోధనకూ భారత ప్రభుత్వంరూ. 25 లక్షలు కేటాయించింది.

21. గ్రామోద్యోగులు గనుక రాజీనామాలు దాఖలు చేసినట్లయితే వాటిని ఆమోదించవలసిందనీ, జమా బందీ పనిలో నిర్లక్ష్యం చేస్తున్నవారిపై తగుచర్య గైకొనవలసిందనీ ప్రభుత్వం కలెక్టర్లకు ఉత్తర్వులిచ్చింది.

22. కాకినాడ,అనంతపూరులలోవున్న ఇంజినీరింగు కళాశాలలో ప్రవేశం కోరిన అభ్యర్థులను ఎన్నిక చేయడానికై ప్రభుత్వం నల్గురు సభ్యులతో కూడిన ఒక కమిటీని నియమించింది. ఈ కమిటీకి ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు అధ్యక్షులుగా వ్యవహరిస్తారు.

23. ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డు తరగతుల సంక్షేమం కొరకై భారత ప్రభుత్వం తలపెట్టిన పథకాలకు రూ. 40 లక్షలు ఖర్చుకాగలవని అంచెనా.

24. ఏప్రిల్ నెలలో భద్రాచలంవద్ద జరిగిన పడవ ప్రమాదాన్ని విచారణ చేయడానికై రాష్ట్ర ప్రభుత్వంచే నియమింపబడిన ఐదుగురు సభ్యులుగల విచారణ సంఘం తమ నివేదికలో ప్రమాదానికి ఏఒక్క అధికారీ బాధ్యత వహించడని పేర్కొన్నట్లుగా వార్త వెలువడింది. భద్రాచలంవద్ద గోదావరిపై వంతెన నిర్మించాలని విచారణ సంఘంవారు సిఫార్సు చేశారు.

25. దేశంలో వ్యవసాయోత్పత్తిని అధికం చేయడానికై 1957-58 సంవత్సరంలో సహకార సంఘాల ద్వారా రైతులకు రూ. 80 కోట్ల మేరకు వ్యవసాయ పరపతిని లభింప జేయవలెనని ప్రభుత్వం నిర్ణయించింది.

రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ సాధారణ అమ్మకపు పన్ను నియమావళిని అసాధారణ గెజెట్‌లో ప్రకటించింది.

26. కృష్ణాడెల్టాలో అదనంగా లక్ష ఎకరాలకు సాగు నీరు లభింపజేయడానికై 1959-60 సంవత్సరం వరకల్లా నాగార్జునసాగర్ డాములో తగుమాత్రం నీరు నిలవచేయబడగలదని తామాశించుతున్నట్లుగా యూనియన్ ప్రభుత్వ నీటిపారుదల విద్యుచ్ఛక్తిశాఖ డిప్యూటీ మంత్రి పత్రికా విలేఖరులతో అన్నారు.

27. హైద్రాబాదు, సికింద్రాబాదు నగరాలలో 13 రోజులుగా టోకువస్త్ర వ్యాపారస్తులు చేస్తున్న హర్తాళ్ కొందరు పురప్రముఖుల జోక్యం ఫలితంగా నిలిపివేయబడింది. జూన్ 15 వ తేదీనుంచి వస్త్రంపై ఎక్కువ రేటుప్రకారం అమ్మకపు పన్ను విధించినందుకు నిరసనగా ఈ హర్తాళ్ మొదలైంది.

రాజమండ్రి, హైద్రాబాదు, కర్నూలు పట్టణాలలో మూడు సాంఘిక, నైతిక, ఆరోగ్య సంబంధమైన కేంద్రాలను నెలకొల్పవలెనని రాష్ట్రసంఘ సంక్షేమ బోర్డువారు తలపెట్టారు. పది శరణాలయాలు కూడా తెరువబడగలవు. వీనిలో మొదటిది గుంటూరులో నెలకొల్పబడగలదు.

28. వాగనుల సరఫరా సరిగా లేదని మిల్లు యజమానులు, ఎగుమతిదార్లు చేస్తున్న ఆందోళన కృత్రిమమైందని యూనియన్ రైల్వే మంత్రి విజయవాడలో పత్రికా ప్రతినిధులతో అన్నారు.

29. 1956 సంవత్సరపు ఆంధ్ర ఇనాముల (రద్దు రైత్వారీకి మార్పు) చట్టము ననుసరించి ప్రభుత్వం సిద్ధపరచిన నియమావళి ప్రకటింపబడింది.

సామాజికాభివృద్ధి కార్యక్రమం క్రిందగల ప్రాంతాలలోని స్వల్ప నీటివనర్ల పనులను స్థానిక పంచాయితీలకు అప్పగించడానికి రాష్ట్రప్రభుత్వం నిర్ణయించింది.

30. సరిహద్దు ప్రాంతాలను న్యాయబద్ధంగా ఇచ్చిపుచ్చుకోవడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంసిద్ధమైవుందని మద్రాసులో రాష్ట్రముఖ్యమంత్రి ప్రకటించారు.

* * *



# మొదటి పంచవర్ష ప్రణాళిక ఫలితాలు

## ప్లానింగ్ కమీషన్ సమీక్ష

మొదటి పంచవర్ష ప్రణాళిక ఫలితంగా భారతదేశం వ్యవసాయ పారిశ్రామిక రంగాలలో విశిష్టమైన అభివృద్ధిని సాధించిందని ప్లానింగ్ కమీషన్‌వారి సమీక్షవల్ల తెలుస్తున్నది. గడచిన అయిదేండ్లలో జరిగిన అభివృద్ధిని గూర్చి ఈ సమీక్ష వెలువడింది. మొదటి ప్రణాళికలో వ్యవసాయోత్పత్తికి హెచ్చు ప్రాముఖ్యం ఇవ్వబడిన సంగతి అందరికీ తెలిసిందే. ప్రణాళిక ఆరంభంలో దేశంలో వ్యవసాయోత్పత్తి 5 కోట్ల టన్నులు కాగా ప్రణాళిక ముగిసేసరికి ఈ ఉత్పత్తి 6 కోట్ల 49 లక్షల టన్నులకు పెరిగింది. అంటే నూటికి 29.8 వంతుల చొప్పున ఉత్పత్తి పెరిగిందన్నమాట.

పారిశ్రామికరంగంలో కలిగిన ఫలితాలు అత్యంత సంతృప్తికరంగా వున్నవి. ఇంతకు పూర్వమే లభ్యమవుతున్నట్టి ఆధారాలను చక్కగా వినియోగించుకోవడమేగాక, కొత్త ఆధారాలను కూడా సమకూర్చుకొని అనేక ముఖ్యరంగాలలో ఎంతో అభివృద్ధిని సాధించడం జరిగింది.

ఉదాహరణకు వస్త్రపరిశ్రమను తీసుకుంటే, మిల్లు వస్త్రం ఉత్పత్తి 37180 లక్షల గజాలనుంచి 51020 లక్షల గజాలకు పెరిగింది. అంటే నూటికి 37.2 వంతుల చొప్పున పెరుగుదల సంభవించిందన్న మాట.

సమాజసేవల విషయంలో సమీక్షలో ఈ విధంగా పేర్కొనబడింది: "ఆసుపత్రులు, చికిత్సాలయాల సంఖ్య తగుమాత్రంగా పెరిగింది. మలేరియా, ఫైలేరియా మొదలగు వ్యాధులను అదుపులో పెట్టడానికై భారీయెత్తున కార్యక్రమాలు అమలుజరుపబడ్డవి, విద్యావిషయకంగా చూస్తే ప్రాథమిక పాఠశాలల్లో చదువుకొనే పిల్లలసంఖ్య 187 లక్షలనుంచి 248 లక్షలకు పెరిగింది. ప్రతిసంవత్సరం ఉత్తీర్ణులయ్యే గ్రాజుయేట్-ఇంజనీర్లు, సాంకేతికోద్యోగుల సంఖ్య 2,200 నుంచి 3,700 కు పెరిగింది. డిప్లొమాలు పొందేవారి సంఖ్య 2700 నుంచి 4000 లకు పెరిగింది. సామాజకాభివృద్ధి కార్యక్రమంక్రింద వ్యవసాయం, సహకారం మున్నగు కార్యకలాపాలలో 14,000 మంది గ్రామసేవకులకు, 1850 మంది పర్యవేక్షకులకు శిక్షణ ఇవ్వబడింది."

మొదటి ప్రణాళిక ఫలితాలను మొత్తంమీద అంచెనా కడుతూ ఈ ప్రణాళికకాలంలో జాతీయాదాయంలో నూటికి 17.5 వంతుల చొప్పున పెరుగుదల జరిగిందని సమీక్షలో తెలియజేయబడింది.

# ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం

## తెలుసుకోవలసిన విషయాలు

- గోదావరినదికి ఒక పాయ అయిన గౌతమిపై ఆలమూరు వద్ద వంతెన నిర్మింపబడుతున్నది.
- ఈ వంతెనకు శ్రీ కళా వెంకటరావుగారు 1919 డిసెంబరు 14 వ తేదీన శంకుస్థాపన చేశారు. వంతెన నిర్మాణం పని 1956 మార్చి 1 వ తేదీనుంచి ఆరంభమైంది.
- ఈ వంతెన పొడవు 1 మైలు 4 ఫర్లాంగులు.
- వంతెనకయ్యే ఖర్చు అంచెనా రూ. 1,55,00,000
- వంతెన నిర్మాణంలో లక్షమంది పనిచేస్తున్నారు.
- వంతెన నిర్మాణానికి నాలుగేండ్లు పడుతుందని అంచెనా,



పార్లమెంటు సభ్యులు శ్రీ బల్వంతరాయ్ మెహతా, వారి బృందంలోని ఇతర సభ్యులు తూర్పు గోదావరి జిల్లాలోని కడియం మహిళా సంక్షేమకేంద్రాన్ని దర్శించారు.



శ్రీ బల్వంతరాయ్ మెహతా బృందంవారు సామర్లకోట కేంద్రంలో ఎక్స్టెన్షన్ ట్రెయినింగ్ అధికార్లతో చర్చలు జరుపుతున్నారు.

